# ఉపన్యాసములు

(మొదటి భాగము)



కృత్తివెంటి
వెంకటసుబ్బారావు.





విద్యార్థులకు వెల రు. 0–12–0    ఇతరులకు రు. 1–0–0.

పోస్టేజీ వేఱు.

రాజన్ ఎలెక్ట్రిక్ ప్రెస్, రాజమండ్రి.

# విజ్ఞప్తి.

*'Poetry is criticism of life'*

Arnold.

ఈ వ్యాసములు కొంతవఱకు చారిత్రకములు. కొంతవఱకు వైమర్శికములు. ఇందు మొదటిరెండును 1930 సం॥ అక్టోబరు ప్రాంతమున రచించి యుపన్యసించినవి. మూఁడవది కాకినాడ కాలేజీలో లెక్చరరుగా నున్నపుడు (1931 అక్టోబరు ప్రాంతమున) అచ్చటను, తరువాత కొలఁదిదినములకే రాజమండ్రి ఆర్ట్సుకాలేజీలోను, సంగీతసాహిత్యముల గూర్చి యుపన్యసించినపిదప వ్యాసరూపము నిచ్చుటకు సంకల్పము గలిగెను. అది సంకల్పమాత్రముగనే యుండె రాజమహేంద్రవరమున యువతీసంస్కృతకళాశాలలో వైస్‌ప్రిన్సిపాలుగ నుండినపు డచటిసంగీతము చూడఁగ చూడఁగ నీ వ్యాసమునకు త్వరగలిగినది. 1933 సం॥ ఆవిషయమై రెండుమూఁడుసారు లుపన్యసింపఁగ ఈప్రస్తుతస్వరూపము నొందినది. ఇందు సంగీతములో స్వరకల్పనలు, బహువిధగమకములు మున్నగు వానికిని, సాహిత్యములో ప్రబంధములనుండి మహాకవుల కవిత్వసౌందర్యమునకును—గ్రంథము పెఱుగునను భీతిచే, నుదాహరణము లెత్తి చూపలేను.

ఈ చిన్నపొత్తము రాజమండ్రి కొవ్వూరు నరసాపురము వారిసాయమున వెలువడినది. వారికి నేను కృతజ్ఞుఁడను.

అచ్చటచ్చట కొందరి కితవుగాని కొన్నివిషయములుండ వచ్చును కాని యవివ్యక్తిపరములుగ నొకరికొఱకును మఱొకరి నుద్దేశించియు వ్రాసినవి కావు.

35 వ పుటలో కావ్యేషు నాటకారమ్యాః అని యున్నది. "కావ్యేషు నాటకం రమ్యం" అని చదువుకొననగును. మఱి యితరదోషము లెట్టివే నున్నచో చదువరులు సహృదయులుగ తెలిపినచో అవసరముబట్టి సవరింతును.

రాజమండ్రి
25—3—35

ఇట్లు, విధేయుఁడు
కృ. వెం. సుబ్బారావు.

# విషయానుక్రమణిక

విషయము

శ్రీరస్తు.

## " దేశభాషలందుఁ దెలుఁగులెస్స "

సృష్టిలో జంతువులన్నిటిని (ప్రాణికోటి) మించి మనుష్యునకుఁగల యాధిక్యము మాటలాడుట యాలోచించుట. మాటలాడుటకు భాష యావశ్యకము. భాషవలననే భావముల నొకరికొకరు తెలియఁజేయ గలుగుచున్నారు. అట్టి భాషాభివృద్ధి దేశాభివృద్ధి కెంతయవసరమో వేఱుగ చెప్పనక్కరలేదు. ఇట్టిభాషాభి వృద్ధికితోడ్పడువారేకవులు. వాఙ్మయమనగా కేవలము నవలలునాటకములు ప్రబంధములనియు, కవులనగాకందము చెప్పు వారు ఛందోబద్ధములగు కూర్పులు నాల్గింటి వెలువరించువారనియు నొకయభిప్రాయమేమూలనైననుండునేమో. చరిత్రలు, శాస్త్రములు, రాజకీయములు, నైతికములు, లోనగునవి (రైల్వేనవలలు, పోడుముపోక చెక్క సంవాదము, గుంటూరుగుంట, రాజమండ్రిరవ్వ, మున్నగు నుద్గ్రంథములు, ప్రస్తుతము దేశమును గగ్గోలుపఱచు భావప్రకటనలు, ఉక్కిరిబిక్కిరి కవిత్వములు విడిచి) చదువుటకు యోగ్యతగల యేగ్రంథమైనను వాఙ్మయాభివృద్ధికి తోడ్పడునదే. వార్తాపత్రికలలో కాని, వ్యర్థప్రకాశకులచేగాని ప్రచురణభాగ్య మబ్బిన ప్రతిరచనయును భాషాలంకారమను వెట్టిగలవారు లేకపోలేదు. ఒకటి రెండుపంక్తులు గికురించినమాత్ర నొక కవియు, పరీక్షలు

తప్పిన యాగ్రహమువనో, న్యాయవాద్యాదినిజవృత్తుల పని లేమి తీతికచేతనో పాఠకదౌర్భాగ్యదశనో అపరాధపరిశోధక నవలను రచించిన పూజ్యుఁడనొక గ్రంథకర్త యయిన నట్టి వారికి మా నమస్కృతములు.

పాశ్చాత్య దేశములందువలె మనదేశమున ప్రత్యేక చరిత్రలు లేకుండుట నాగరికులకొక గొప్పలోటుగ తోఁచక మానదుకాని యట్టివి పీరనుకొనినంత నిరాధారమని నేనువిశ్వ సింపను. వాయుపురాణాదులను రామాయణాదులను భూగోళములేని కొలంత కొంతవఱకైనఁ దీలకమానదు. కేవలరస హీనమగు (Dry-as-dust) చరిత్ర పక్కివారికి రుచింపక కావ్యోలు, ప్రబంధాదులలో వంశానుక్రమణికాదివర్ణనముల మూలమున చారిత్రాంశములు వ్రాయఁజొచ్చిరి. రానురానవి కేవల స్తోత్రపాఠానుకరణములైనవి. మేఘసందేశాదులలోఁ గల కథయేమి? మేఘసంచారమను నెపమున ఉజ్జయిన్యాది నగరములు, గంభీరాదినదులుమున్నగుభౌతికపటము చిత్రింపఁ బడినది. ఇటీవల పరిశోధకులు, వాయు, బ్రహ్మాండ, పురాణాదులవలనను; భాస్కరగణితసిద్ధాంతములవలనను మనదేశ భూగోళచర్చలును, కల్యాంశలు నెఱుంగఁజాలియున్నారు. (South Indian Research లో కొన్ని చూడనగును.) ఎటు లున్నను దిఙ్మాత్రము లైనవేకాని వలయు పరిమితిని లేవు. శతకములు మున్నగునవి తొలుతను దేశకాల పాత్రాచా

26934
23-3-73

-రాదులగు విషయములు దెలియుటకుఁగూడ నాధారములగు చువచ్చినవి. క్రమమున నవియును కేవల పద్యప్రాయము -లును, భక్త్యాద్యుపకరణములే నైనవి.

భాషాభివృద్ధికి దేశాభ్యుదయము పెక్కు విధముల తోడ్పడును. ఒకదానినిగల వ్యత్యస్త పరిణామములు రెండవ దానియందును గన్పట్టును. రాజపోషణమున నొక్కొకటి రాజభాషయై దేశభాషయై సముచితాదరమున పెంపొందు చుండును. కవులకప్పుడు నోములపంట, గ్రంథకర్తలకు పాడి -పంట, ప్రకాశకులకు భాగ్యోదయము. అటుకాక దేశము క్షుభితమై, దారిద్ర్య భూయిష్ఠమై, అశాంతిఁబఱఁగిన రచయిత లవా తెఱలకు బీగములువడినట్లు, కవుల కలములకు సంకె -లలు దగిలినట్లు, భాషా యోష బ్రతుకుదెఱువులేక వలస పోయి నట్లుకదా.

ఆంధ్రదేశ చరిత్రము, ఆంధ్ర రాజుల చరిత్రము దెలి -సినచో ఆంధ్రభాషా చరిత్రముగూడ తెలియఁగలదు. ఆంధ్ర జనులపేరు మొదట నైతరయబ్రాహ్మణమున (క్రీ. పూ౧౦౦౦) నాటి గ్రంథమునఁగన్పడును. (వాల్మీకి రామాయణ, వ్యాస భారతముల వలనను, వాయుమత్స్యపురాణములవలనను) (కాణ్వవంశపు కడపటిరాజును ఆంధ్రరాజు చంపినట్లు) గూడ తెలియును. క్రీ.పూ. 300 సంవత్సరప్రాంతమున ఆంధ్ర రాజ్య మత్యున్నతదశ నున్నట్లుగ మెగస్థనీస్ (Chandragupta's

Embassador)వ్రాసెను. మగధరాజ్యము తరువాతహిందూదేశ ములో నున్నతస్థితి నొందినది ఆంధ్రరాజ్యమే. అశోకు ననంతరము సామంతులగు నాంధ్రులు మగధేశుల లక్ష్యపెట్టక స్వతంత్రులయిరి. పురాణములు, శాసనములుబట్టి ఆంధ్రవంశము (శాతకర్ణవంశము) కృష్ణా, గోదావరీనదుల మధ్యరాజ్య మేర్పరచుకొని మగధ దేశమువరకు నాక్రమించిరి. వీరు తూర్పున శ్రీకాకుళము (కృష్ణాజిల్లా చల్లపల్లి జమీలోనిదని యొకయభిప్రాయము) రాజధానిగ గలిగి క్రమమునఁ బశ్చిమమునకుఁ బోసాగి క్రీ॥ శ॥ 1515 కళింగదేశముపై దండెత్తి విజయవాటినుండి శ్రీకాకుళమేగినపుడు విష్ణుచిత్తీయ రచన సందర్భమున "దేశభాషలందుఁ దెలుగులెస్స" యని యాంధ్ర విష్ణువుచెప్పెను. పిఠాపురము, అమరావతి, ధరణికోటయు వీరికి రాజధానులైనవి. రాజ్యాభివృద్ధిని, ప్రతిష్ఠానపురము (ప్రస్తుతము పైఠన్) పశ్చిమ రాజ్యధానిగ నుండెను. శాతకర్ణి యను నతఁడు కాణ్వుఁడగు మగధరాజును (క్రీ. పూ. 27) జంపి దాని నాక్రమించెను. అప్పటినుండియు నాంధ్రరాజులు తలయెత్తి నపుడెల్ల నాంధ్రసరస్వతి సుఖవిహారము సలిపినది. (క్రీ. శ. 68) హాలుఁడనువాఁడు మంచి విద్వాంసుఁడును గవియునై, కవుల నాదరించెను. (సప్తశతియనిప్రాకృతమున రచించెను.) క్రీ.శ. 114-138 వరకు రెండవ విలివాయకరు అను నతఁడున్నతుఁడై పరరాజులగు క్షేత్రపుల (Satrops) దోలి చష్టను నతని తనప్రతినిధిగ నుజ్జయినిలోనుంచి రాజ్యము విస్తరింపఁజేసెను.

పిదప పులుమాయి, రుద్రమానులు రాజ్యమేలిరి. ఈ రెండవ పులుమాయి ఆంధ్రరాజ్యములోని సౌరాష్ట్రము (కథియవాడ్) మాళవము, కచ్ఛము, సింధుదేశము, కొంకణముము నాక్రమించెను. తరువాత క్రీ. శ. 184-213 యజ్ఞశ్రీరాజ్యము వైభవముకలదై వెండినాణెములు చేయించెను. సముద్రవర్తకము పెంపొంది యుండెను. అంతరాజ్యము భిన్నశకలప్రాయమైనది. దక్షిణమున కాదంబులు, పల్లవులు, వేఁగిరాజులు ఆంధ్రరాజ్యమాక్రమించిరి. కృష్ణా గుంటూరు మండలములలో అమరావతి జగ్గయ్యపేట మున్నగు నెడల నుండి పిదప బౌద్ధమతము విడిచి బ్రాహ్మణులయిరని తెలియవచ్చును. అప్పటి నాగరికత యీనాటికెందును దీసిపోక కొన్నిట విశేషించియుండెను. ఇటలీ, గ్రీసు, టిబెట్టు, చీనా పారసీకులతో వ్యాపారములు, రాకపోకలు, సముద్రయానములు, సక్రమపరిపాలన గలిగియుండెను. పాటలీపుత్రము మున్నగుచోట్ల ధర్మాసధశాలలుండెను. దీనికి తరువాత 600 యేండ్లకుపైనయూరపుననిట్టిది యొకటి బయలుదేరెను. హిందూదేశమే ప్రపంచమునకు మార్గదర్శి. ఋగ్వేదకాలమునఁ బ్రారంభమైన జ్యోతిష మీకాలమున వృద్ధినొందెను. (గార్గ్య, పారాశర్యాదులు) మను యాజ్ఞవల్క్యాది స్మృతులును వెలువడినవి.

క్రీ.శ. 500-1200 వరకు నిది పౌరాణిక యుగమని చెప్పవచ్చును. విదేశయుల దాడి హెచ్చెను. విక్రమార్కుఁ

డుజ్జయిని నేలుచు నిట్టి పరరాజుల (తురేనియనులు etc.) జయించి శకకర్తయయ్యెను. కాళిదాసాదు లీతని యాస్థానమునుండి సరస్వతిని నిండుమనమునఁ బెంచిరి. పిమ్మట శ్రీహర్షుఁడును తానుకవియై గ్రంథములురచించికవులఁబోషించెను. శాస్త్రపరిజ్ఞానము మహోన్నతత్వము నందెను. హియాన్‌సన్ అను బాటసారి వలన నానాటి మన ఆంధ్రచరిత్రయుఁ గొంత తెలియవచ్చినది. గంజాం మండలమువాడగు కుమారిలభట్టు జైనబౌద్ధమతములను ఖండించి (కర్మవాదియగుటచే) జైమిని కృతపూర్వ మీమాంసకు భాష్యము వ్రాసెను. అటుపై శంకరుఁడు (మళయాళ దేశస్థుఁడందురు) జన్మించి హిందూ మతోద్ధారకుఁడై గీతకు, ఉపనిషత్తులకు, సూత్రములకు భాష్యములు వ్రాసెను. (అద్వైతమతస్థాపకుఁడు క్రీ. శ. 7: వ. శతాబ్దమువాడు.)

11 వ శతాబ్దమున రామానుజుఁడు జనించి శంకరుని మతమును తిరస్కరించి ప్రస్థానత్రయము వ్రాసి వైష్ణవ మతమును బోధించెను. (ఇతఁడు విశిష్టాద్వైత మతస్థాపకుఁడు). శంకరుఁడు జ్ఞానమార్గోపదేష్ట. రామానుజుఁడు భక్తిప్రాధాన్యవాది అనంతరము అనంతతీర్థులను నతఁడు ద్వైతమత కారకుఁడు వెలువడెను. వీరి యనుయాయులే నేటిమాధ్వులు. కర్ణాటకమున దీని కెక్కుడు వ్యాపకముకలదు. ఈతఁడును ప్రస్థానత్రయ భాష్యమువ్రాసి మఱియుచాలగ్రంథములు రచించెను.

ఇట్టివాఁడు బసవేశ్వరుఁడు మఱొకఁడు. ఇతఁడుభక్తియే ప్రధానమని బోధించి సంస్కర్తయై 'లింగధారణ' మతమును బయలుదీసెను. ఈతఁడు బిజ్జలుని మంత్రి, బసవపురాణ మిప్పటిదే. క్రీ. శ. 1162 కల్యాణపురము.) విక్రమాంక దేవుని నాయకునిగావర్ణించు విక్రమాంకదేవ చరిత్రము బిల్హణకవిచే 1100 సం॥ ప్రాంతమున రచింపబడెను. కల్యాణపురమున నిచ్చటనే మితాక్షర ధర్మశాస్త్రమునకు కర్తయైన విజ్ఞానేశ్వరుఁడునివసించియుండెను. తరువాత తైలుఁడు తరువాత బిజ్జలుఁడు శైవమతవృద్ధియు ఁజెప్పబడినవి.

సామాన్యచరిత్ర మటుంచి తిరిగి యాంధ్ర చరిత్రమున ప్రవేశింతము. పల్లవులు, పూర్వపశ్చిమ చాళుక్యులు ప్రబలిన తరువాత దేవగిరి యాదవులును, ఓరుగంటి గజపతి రాజులు మహారాష్ట్రాంధ్ర దేశముల వైభవమున నేలిరి. మిక్కిలి దక్షిణమున పాండ్య, చేర, చోళ, రాజ్యములు తల లెత్తినవి. కల్యాణపట్టణము రాజధానిగ పరిపాలించుచు పుల కేశియను నతఁడు క్రీ. శ. 610 వేఁగిదేశమునుండి పల్లవుల పారఁదోలి దాని నాక్రమించెను. ఇతని విఖ్యాతి పారసీక రాజులనుండి జఱిగిన రాయబారములవలనఁ దెలియఁగలదు. కాంచీ దేశము వేఁగిదేశము అయిదారవ శతాబ్దములవరకు పల్లవుల చేతులనుండెను. ఆంధ్ర, ద్రావిడ, కర్ణాట దేశములు వీరుజయించిరి. 7 వ శతాబ్దమున పశ్చిమ చాళుక్యులు వీరినోడించి ఆంధ్రదేశమును వశపఱచుకొనిరి.

కృష్ణా గోదావరులకు నడుమనున్న యెనిమిది వేలచదర పుమైళ్ళ,వైశాల్యముగల తెలుగుసీమ వేఁగినాడందురు. 7 వ శతాబ్దమునుండి 13 వ శతాబ్దమువరకు తూర్పు చాళుక్యులు దీని నిపరిపాలించిరి. ఏలూరు సమీపముననున్న వేఁగి దీనికి రాజధాని. ఉత్తరమున కళింగవరకును, దక్షిణమున పల్లవుల (చోళ) కాంచీనగరమువరకును విస్తరించియుండెను. రెండవ పులకేశి చోళులజయించి తనతమ్ముని కుబ్జవిష్ణు వర్ధనుని వేఁగికినియమించెను. ఇతఁడు క్రమమున స్వతంత్రుఁడయ్యెను. కుబ్జవిష్ణువర్ధనుఁడు 615నుండి 633 వరకు పరిపాలించెను. పిష్ఠపురదుర్గము (పిఠాపురమును) సాధించెను. దిమిలి సీమలోని వీనిశాసనములచే విశాఖపట్టణ మండలమువరకును రాజ్యము విస్తరించినట్టుతోచును. ఇతనిపుత్రుడు నెల్లూరువరకు రాజ్యము విస్తరింపఁజేసెను.వీనిదానశాసనమొండు(గుడివాడ తా॥పెణుకపర్రుగ్రామమొకవిప్రునికిచ్చినట్లు)గలదు. ఈవంశమున నిరువదియాఱవ రాజగు విమలాదిత్యుఁడు 1015-1022వఱకు రాజ్యము చేసి రాజేంద్ర చోళుని చెల్లెలు రాజకేసరివర్మ కూతురునగు కుండమాంబాదేవిని వివాహమాడి యామెవలన ఆంధ్ర భారతకృతిపతియగు రాజరాజనరేంద్రుని గాంచెను. అచ్చటచ్చట చెప్పఁబడిన పురాణాదులు సంస్కృత రచనలుదక్క ప్రత్యేకముగ నాంధ్రగ్రంథ సంపత్తి విమలాదిత్యుని నాటి వఱకు నెంతగలదో తెలియు నాధారములులేవు. ప్రస్తుతము వ్యాపకముననున్న ఆంధ్రభాష కానాడు నామకరణమైన

దనియే ప్రస్తుత భావన. వీని తరువాత కులోత్తుంగ చోళదేవుడు విక్రమచోళుఁడు నిట్టి యౌన్నత్యమునకు పాత్రులైనట్లు గన్పట్టదు.

1278 నాటికి కృష్ణా గోదావరీ మధ్యదేశము గజపతి రాజుల వశమైనది. ఇప్పటికి చాళుక్యులు (సూర్యవంశ్యులు) చోళులుఁ (చంద్రవంశజులు సంబంధ బాంధవ్యములచాలదగ్గర వారైరి. చోళులనాటి నాగరకత యమూల్యమైనది. ప్రజా పాలనము,(Democracy) చక్కగ సాగుచుండెను. పంచాయతీలు, పన్నువసూళ్లు, దేశోపయోగవ్యయము, తోటలు కాలువలు, సేనలు, తాలూకా, జిల్లావిభజనలు మొదలగువానిచే శాంతియుతమై సర్వ సమృద్ధముగ నుండెను. ఇంతలో దేవగిరి యాదవవంశ మొకటి తలయెత్తి ఐదవ భిల్లముఁడు చళుక్యుల పరాభవించి కళ్యాణ పట్టణములోఁ ప్రవేశించెను. కృష్ణ కుత్తరమాక్రమించి దక్షిణము గాఁబోవఁబోయి యోడెను. ఉత్తరహిందూస్థానమున గోరీ పృథ్వీరాజుతోఁబోరు సమయమిదియే. జైత్రపాలుని (వీనికొడుకు) యాస్థానమున భాస్కరాచార్యుని పుత్రుఁడుండెను. ఈ యాదవుల రాజ్యమున సంగీత రత్నాకరమను గ్రంధము శార్ఙ్గరవునిచే రచింపఁబడెను. వీరి పాలనముననే భాస్కరునితమ్ముఁడగు శ్రీపతి, తత్పుత్రుఁడు గణపతి, వానికుమారుఁడు అనంతదేవుఁడు మున్నగువారి వలన గణిత (జ్యోతిశ్శాస్త్రము) చక్కని యభివృద్ధి గాంచినది. చాంగదేవుఁడు (భాస్కరుని మనుమఁడు) సిద్ధాంత శిరో

మణియను గ్రంథము నేర్పుటకై పాఠశాలను స్థాపించెను. పిమ్మట కృష్ణుని యాస్థానమున సూక్తి ముక్తావళి, వేదాంత సూత్ర భాష్యమునకు టీక (గ్రంథములు) వెలువడెను. అటుపై రామదేవుఁడేలెను ఈతఁడు ఓరుగంటి ప్రతాప రుద్రునివలెనే ఢిల్లీకి చెరఁగొంపోఁబడెను. ఈయిద్దరితోడనే వారివారి వంశము లంతరించినవి. రామదేవుని దానశాసనములనుఁబట్టి యానాటి సాంఘిక నైతిక విషయములు తేటపడఁగలవు. ఈరాజునొద్ద హేమాద్రి బోపదేవులు విద్వాంసులు గలరు. హేమాద్రి ధర్మశాస్త్రములగురించి (చతుర్వర్గ చింతామణి etc.) వ్రాసెను. ఇతఁడు మోడీయను లిపినిర్మించెను. ఇండ్లుకట్టు నూతనవిధము కనిపెట్టెను. రెండవవాడు ముగ్ధబోధమను సంస్కృత వ్యాకరణము, కొన్ని వైద్యగ్రంథములు రచించెను. మాలికాఫూర్ (అల్లాఉద్దీన్ ఖిల్జీ సర్దారుఁడు) వీనిని చెఱఁ గొనియేగెను.

తూర్పు చాళుక్యులకు పిదప నాయకులైనవారు గణపతిరాజులు, వీరే కాకతీయ వంశజులు, వీరిరాజధాని ఓరుగల్లు (Present Waraugal in Nizam)ఇచటనే అనుము కొండ యను గ్రామముకలదు. కాకతీయులు గంగ వంశజులని కొందరు, చోళులని కొందరు, యాదవసంతతియని కొందరు. వీరు మొదట చిన్నసంస్థానాధిపతులుగనుండి తరువాత మహాబలవంతులై ఓరుగంటిరాజ్యమని పేరుమ్రోగునట్లుచేసిరి అనుముకొండలో వీరు నిర్మించిన వేయిస్థంభములగుడి శిథిలమయ్యును వైభవము

చాటును, ఓరుగంటి దుర్గము పాడువడి నామావశిష్టమైనను తొల్లింటి విఖ్యాతిని సూచించును. కాకతిప్రోలారాజు 1109 వఱకు రాజ్యముచేసి ఉత్తరమున కటకముం దక్షిణమున శ్రీశైలము, తూర్పున సముద్రము, పశ్చిమమున మాల్యవంతమువఱకు నేలెను. వినికుమారుడు మొదటి ప్రతాపరుద్రుడు. వీనికుమారుండు గణపతిరాజు. ఇతండు దేవగిరి యాదవులపై దండెత్తి యప్పనములుగొని రాజపుత్రికయగు రుద్రమదేవిని గొని సంధికొప్పుకొనెను. చోళ కటక రాజులను మన్నెదొరలను గెలిచెను. పరనారీసహోదరబిరుదులుండుటచే వీనిపవిత్రశీలము తెల్లమగును. ఈతండు శైవమతాభిమానియై జైనమతము రూపుమాపెననివాడు కకలదు. తిక్కనసోమయాజి ప్రేరేపించి జైనులం జంపించి, పారద్రోలించెననియు చెప్పుదురు.

కాకతీయుల సామ్రాజ్యము తిరుచినాపల్లివరకు వ్యాపించెను. కంచిపీఠిస్వాధీనమున నుండెను. దక్షిణమున కడపటి పాండ్యరాజు (నామకుండైనవాండు) సుందరుండు, దక్కను, దక్షిణయిండియా మాలికాపూర్ అనునతండు కొల్లగొని ద్వారసముద్రమును భీభత్సమొనరించి పోయిన దేశ మల్లకల్లోలమయ్యెను. ఈతరుణమున రవివర్మ కులశేఖరుండను నతండు కంచివరకు జయించుచుం బోయెను. ఇట్టియదనునతుంగాభద్రాతీరమున నిరువురు వచ్చి యొక క్రొత్తనగరము 1336 (విజయనగరము స్థాపించి) దేవగిరి యాదవుల

వారమని చెప్పి దక్షిణదేశమునకు ప్రభువులైరి. రాజరాజు (కులోత్తుంగ చోళదేవుని) నాటి ఐకమత్యమిపుడు మరలకుదిరెను. వీరిరువురు హరిహరరాయలుబుక్కరాయలు. వీరు రాయల వంశములోనివారు (ఆనెగొందినుండి విజయనగరము నకు రాజధానిని మార్చిరి.)

కాకతీయ సామ్రాజ్యము క్రమశః అస్తమించినది. విజయనగర సామ్రాజ్యము దినదిన ప్రవర్ధమానమగుచున్నది. రెడ్డిరాజుల ప్రభుత్వము నొకవంక నున్నతివడసెను. తరువాత బహామినీరాజ్యము (గోల్కొండ నవాబుల రాజ్యములు) బయలుదేరినవి. కృష్ణదేవరాయుల రాజ్యము రాయచూరు ముట్టడి ఈనంబధమగు చరిత్ర ప్రస్తుతమందరకును దెలిసినదే. అవసరమాత్రముగ నచ్చటచ్చట కవుల చరిత్రములలో వారి వారిగూర్చి తెలియపరతుము.

రాజరాజనరేంద్రుఁడు తెలుఁగు సారస్వతమునకు ఆంధ్రభోజుఁడు. తెలుఁగు భాషవీని చేతులలోఁ బెఱిగి మాటలాడ నేర్చిగారాము నొందినది. ఈతని ఆస్థానమున నారాయణ భట్టునన్నయభట్టుమున్నగు పండితులుపావులూరి మల్లన యను గణితశాస్త్రజ్ఞుఁడు గలరు. నన్నయ నారాయణభట్టు సాయము గొని రాజనరేంద్రుని కృతిపతి గావించి సంస్కృత భారత మునుదెనిగింపఁ దొడఁగెను. ఈతని ఆంధ్రశబ్ద చింతామణి రచనము భారతమునకు పూర్వము ఈకాలమున నధర్వణాచార్యుఁ డనునొకకవి భారతముదెనిగింపఁబూనెనట. అది శిధిలమైనది.

కొన్నిఘట్టములు ఆంధ్రసాహిత్యపరిషత్తు వారికి లభింపఁగాఁ బ్రకటించిరి. ఈతని వ్యాకరణమునొకటికలదు. ఈతని కించుమించు సమకాలీనుఁడు వేములవాడ భీమకవి ఈతఁడు కళింగ గంగరాజులకడను (బొక్కనృపాలుని కడను) నుండెనట. ఈతని కవిత్వ మనర్గళమైనది. ఇతని ఛందము ప్రసిద్ధమైనది. ఈతనిచాటువులు చాల ప్రచారమున నున్నవి. ఈతఁడు రాఘవపాండవీయమను ద్వ్యర్థికావ్యమును రచించెననికొందరు. వీనిపద్యముల వలన ఆనాటి శబ్దరూపములు గొన్ని తెలియవచ్చును, నాండుఁమూాండు, ఆండ్రు (ఇట్టివి నేటిఅరసున్నలకు నాఁడు, మూఁడు,) మున్నగునవియున్నవి. చాళుక్య చోళ వంశముల సంబంధ బాంధవ్యములవలన చోళులుగూడ పరిపాలించిరని మున్నె చెప్పియున్నాము. నన్నెచోడుడను నొక ప్రభువు తానుకవియై పండితుల కవుల నాదరించెను. ఆంధ్ర కుమార సంభవము వీనిరచనము. ఇందలి శయ్య చాలమధురము. ఆందుగూడప్పైఁగల నాటిరూపములుగాననగును. అందు దెలుఁగుపదముల పొందిక ప్రశంసనీయము. కొందరు రామాయణకర్తయగు భాస్కరుడుకూడ నన్నయకు పూర్వుఁడే యందురు. అందులకుకారణము తిక్కన భాస్కరుని తనతాత యని వ్రాసెను. నన్నెచోడుఁడు భీమకవియు పూర్వులైనగా వచ్చును. నన్నయ రెండుపర్వములు పూర్తిచేసి మూఁడప దానిలో కొంతవరకే ఆంధ్రీకరించెను. పిమ్మట తిక్కన రాజుచే నియమితుఁడై (నెల్లూరు మండలాధిపతి

యగు మనుమసిద్ధి కాలమువాఁడు) మిగిలినపదునేను
పర్వములు తెనిఁగించెను. భాస్కరుఁడు. మల్లికార్జునభట్టు
(అయ్యలార్యుఁడు. కుమార రుద్రదేవుఁడు) మున్నగు
వారిచే వాల్మీకికృతమగు రామాయణము తెనిఁగింపఁబడెను.
గ్రంధముల నంకితములబట్టి యానాటికవులకుఁగలమున్నసయు,
వారిప్రభువుల యాదరమును (Impetus) తెలియును. రాజునకు
బంధువగు రంగనాథుఁడు రామాయణమును ద్విపదగా రచిం
చెను. పై రామాయణ కవిత్వము ప్రౌఢముగ హృద్యముగ
నుండును. రంగనాధరామాయణము ద్విపదవృత్తమున నుం
డియు, పై గ్రంధ శయ్యలకు వెనుకపడక ప్రౌఢోక్తుల నెనయు
చున్నది. ఈ రామాయణకవులే, ఎఱ్ఱాప్రెగడ పోతనాదు
లకు అంత్యానుప్రాసమున కాదర్శులైరి. ఇందు కొన్ని నన్న
యభట్టీయ వ్యాకరణవిరుద్ధప్రయోగములుండుట చేతను
నన్నయకు పూర్వులాయని తోఁచును.

తిక్కన సోమయాజియై షట్ఛాస్త్రపండితుఁడై కవి
బ్రహ్మయై భారతము పూర్తిచేసి నిర్వచనోత్తర రామాయ
ణమునుగూడ రచించెను. కాకతిగణపతిరాజునకు సమకాలీ
నుఁడు. గణపతి రుద్రాదులును కృతిపతులైయాంధ్రకవులఁ
బోషించిరి. తిక్కన కవివాగ్బంధనము లక్షణ గ్రంథముకూడ
వ్రాసెను. తెలుఁగుబాలిక యిప్పటికి విద్యాబుద్ధుల నేర్చునద
గుచున్నది. తిక్కన దానికి యొజ్జయయ్యెను. తిక్కన కుమా
రుడు మారనకవి మార్కండేయ పురాణమును రచించెను.

సోమదేవరాజీయమను ప్రతాపరుద్రుని వంశచరిత్ర మప్పటి చరిత్రకు కొంతతోడగుచున్నది. తిక్కన సమకాలికుఁడగు కేతన యొకఁడు పేర్కొనఁదగినవాఁడు. ఆంధ్రభాషా భూషణమను లక్షణగ్రంథమును రచించి, హారవిలాసమను మరియొకగ్రంథము కూడరచించెను. ఇతఁడు దండికవికృతమగు సంస్కృత దశకుమారచరిత్రము దెనిఁగించెను. ఇది తిక్కన కవినే కృతిపతిగ గల్గినది. దీనిచే తిక్కనకు కేతన కవనమందు గల గౌరవము తెలియవచ్చును. భారతము రాజకీయాంశముల నివేదికయగునట్లు కేతనదశకుమారచరిత్ర సాంఘికాచార సంవేదియై యానాటి చరిత్రము తెలుపునదగుచున్నది.

ఇట్లుగ తెలుఁగుబాలిక కాకతీయులకడఁ బెఱుగుచు, రెడ్డిరాజుల పోషణమునకువచ్చెను. ఈకాకతీయుల యభిమానమున శైవమతము పెచ్చుపెఱిఁగి జైనాదుల నడఁచెను. పాల్కురికిసోమనబసవపురాణము (ద్విపద) కావ్యము వెలువడెను. మఱియు పెక్కుశైవగ్రంథము లానాఁడుదయమైనవి. రెడ్డిరాజులు కొండవీడు నేలుచుండగ, బుక్కరాయల వంశ్యులు ఆనెగొంది నేలుచుండిరి. తెనుఁగుభాష వీరిండ్ల నాట పాటలు నేర్చి ఇండ్లుచక్కఁ బెట్టగలనేర్పు వహించు ప్రాయమునకు వచ్చినది. ఈరెడ్డిరాజులయొద్ద శంభుదాసుఁడను ఎఱ్ఱాప్రెగడ యనుకవియొకఁడు పొడసూపెను. ఈతఁడు భారతమసమాప్తముగ నుండుటచూచి తచ్ఛేషమును (అరణ్యమున నన్నయచే విడువఁబడినదానిని) పూరించెను. నృసింహపురా

ణము, హరివంశమునను మఱిరెండు గ్రంథములువ్రాసి ప్రబంధకవిమార్గదర్శియౌట ప్రబంధపరమేశ్వరుఁడని బిరుదు వడసెను. రమారమి వీని కాలముననే విజయనగర రాజులకడ "నిరంకుశాః మహాకవయః" యని సార్థకపఱచుకొఁదగిన యొక ప్రౌఢకవి నాచన సోముఁడు ప్రజర్విల్లెను' సోము ప్రసాదము' అని కావ్యాలంకార సంగ్రహమునను. "మహా మహులై సోముఁడు భాస్కరుండు"నని మఱియొకయెడను ప్రఖ్యాతివడయు, ఉత్తరహరివంశమను గ్రంధమును రచించెను. తిక్కనాదులకున్న గౌరవముకూడ నీతనికి కలదని చెప్ప వచ్చును.

ఇఁక తెలుఁగు సరస్వతి రెడ్డిరాజుల రాజసౌధ ప్రాంగణోద్యానములనే విహరించినది. ఇంతకుపూర్వమును నిప్పుడు గూడ చాలవఱకు సంస్కృతగ్రంధముల (Hidden treasures) దెనిఁగించుట ఆచారమైనది. అదియొకలోపమని చెప్పుటపొరఁబాటు. అందలి గనులఁ ద్రవ్వుట లోపమని ఎవరనఁగలరు? పద్మపురాణము శ్రీనాధకవి తాతయగు కమలనాభుఁడు, రామగిరి సింగనయు ననుకవులు తెనిఁగించిరి. విష్ణుపురాణము వెన్నెలకంటి సూరన యాంధ్రీకరించెను. స్కాందపురాణమున చాలవరకు శ్రీనాధుఁడే తెనిఁగించెను (కాశీఖండము, భీమఖండము). పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు జైమినిభారతమును శకుంతలాపరిణయమును రచించెను. కంకంటి పాపరాజు, అయ్యలరాజు రామభద్రుఁడు ఉత్తరరామాయణము, రామా

భ్యుదయమురచించిరి. ఇట్లు భారత రామాయణాంధ్రీకరణములు పెక్కులుబయలుదేరెను. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు 'వాణి నారాణి' యని చెప్పసాహసించిన విద్వత్కవి. ఇతని శయ్య నిరంకుశధోరణీవేగముకలది. కంకంటి పాపరాజు ప్రౌఢకవి. శైలి యచ్చటచ్చట కఠినతరము. రంభారావణ సంవాదము మున్నగుచోటులనేకాక మొత్తమునను రసవంతము. ఇంత దనుకను నియోగివైదిక వ్యత్యాసములు కనుపట్టవు. వీని గ్రంథమున నార్వేల నియోగులగూర్చి ప్రత్యేకించి వర్ణిం చెను. మొత్తమున చాలవఱకు తెలుఁగు వాణి నాడునేఁడు నియోగికవుల నభిమానించినది. రామాభ్యుదయము మిక్కిలి హృదయరంజకమైన గ్రంథము. వీరికాలము వారిలో శ్రీనాథుఁ డును, వానిబావమఱఁది బమ్మెర పోతరాజును ప్రసిద్ధులు. మహత్తరులు. నరకృతి పతిత్వమొల్లక అగ్రహారాద్యనేక సంపదలను నిరసించి, కేవలభగవదంకితముఁగ భాగవతమునుఁ దెనిఁగించెను. లౌకికవరేణ్యుఁడై శ్రీనాథుఁడు రెడ్డిరాజులను ముంజేతులను నిలిపి రాజాధిరాజై సకలైశ్వర్యములంది యేగు చుండ నతని బావమఱది హాలికుఁడై శరీరకష్టమున బ్రదికి భగవద్భక్తి పెంపొందుట ప్రపంచమునకెల్ల నీతిదాయక మగు నొకపాఠానుపాఠము (వ్యత్యస్తము) అగుచున్నది. శ్రీనాథుఁడు రాఁగల 20వ శతాబ్దమునకు బాటసారి యయ్యెను. పోతననిజమగు హైందవాధ్యాత్మికతత్వవేది యగుచున్నాఁడు. రాజులవాకిళులవారివారిదయాధర్మములఁ బెరిగిన

యాంధ్రవాణి యట్టెరోసి పవిత్రబ్రాహ్మణునింటికి మరలెను. సింగనాదిప్రభువులు బ్రతిమాలి బెదరించి, యెట్లునుతద్వాణిని వారిండ్లకుకొని పోఁజాలకుండిరి. ఇతఁడు వీరభద్రవిజయము, భోగినీదండకమును గూడ రచించెను. భాగవతమునగల మఱికొందరు కవులపూరణములును తెలుయఁదగినవి. శ్రీనాథుఁడు, వేమారెడ్డి, వీరభద్రారెడ్డి మున్నగువారల బంగరుపళ్ళెరముల నందుకొని ఆంధ్రవాణిని నెఱజవ్వనిగా నొనర్చెను. ఈతని శృంగారనైషధము "సంస్కృతవిద్వదావధమునకు" వన్నెమింఁచిన తెనుగుసేత కాశీఖండము కవిత్వమునకుగీటురాయి. ఈతనికవిత్వము బహుసుకుమారము. మంచి సౌష్ఠవముకలది. అభ్రంకషపవిత్రగంగాప్రవాహ వేగాతిశయముగలది. ఈతని చాటువు లానాటి దేశచరిత్రను వేయి విధముల తెలియఁజెప్పుచున్నవి. ఇతనిపల్నాటి వీరచరిత్రము దేశభక్తిని పురికొల్పుచుండును. రసోద్దీపకమైనది. కొంతవఱకు చరిత్రకాధారభూతము. ఈతడు, నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, సోముడుగాగలయందరిప్రతిభనుమూర్తీభవించిన సరస్వతియాయననొప్పును. ఈతని వీధినాటకమునఁగూడ నీతని శేముషీయపారముగఁగన్పట్టును. ఇంతటినుండి పురాణయుగము క్రమముగ గతించి ప్రబంధయుగమున ప్రభాతమైనది.

కృష్ణదేవ రాయలు ప్రభువయ్యెను. ఆంధ్రసారస్వతమునకు శిశిర మేగినది. చైత్రోత్సవదినము లేతెంచినవి. పెద్దన, రామరాజ భూషణుఁడు, ధూర్జటి, రామ

కృష్ణుఁడు మున్నగు కవికోకిలములు కృపరాట్సభారసాలము నాశ్రయించినవి. క్రొత్త క్రొత్త పోకడలు, స్వతంత్రరచనలు ప్రబంధములు ఆరసాలము పుష్పించి ఫలించినది. కృష్ణరాయల యాస్థానమున అష్టదిగ్గజములుండిరి. అల్లసాని పెద్దన, భట్టుమూర్తి ముక్కుతిమ్మన, పింగళి సూరన, (తెనాలి) రామకృష్ణకవి, రామభద్రుఁడు శంకరకవి, ధూర్జటి. వీరిలో పెద్దన 'ఆంధ్రకవితా పితామహుఁ'డై కవిగండపెండేరమును స్వయముగ రాజుచేతఁ దొడిగించుకొనెను. వీని (స్వారోచిష) మనుచరిత్రము తేనెలొలికించు చుండును. భట్టుకవి వసుచరిత్రము విద్వత్ప్రబంధము. ఇది సర్వసామగ్రి కలయొకవిపణి. శబ్దానందమునకిదిదక్క మత్తేగ్రంథమునుదీనిముందు చెప్పఁగూడదు. దీని ప్రాచుర్యము తరువాత వెలువడి పిల్ల వసుచరిత్రలవలన (నేకవిజనరంజనము etc. )సువేద్యము. వీని నరస భూపాలీయము అనుకావ్యాలంకార సంగ్రహము పేరువడ్డది. "ముక్కుతిమ్మనార్యుముద్దుపలుకు" వానిపారిజాతాపహరణమునుఁ బట్టియేకదా. ఒకపరి చదివినను అందలి. 'బొల్లవల్లపగ్రాసకషాయకంఠము' పేరలుకం జెందిన యట్టి కాంతలు' 'ఎంతకులేడు నారదమునీంద్రుడు'—వీనివిడుచువారుండరని నమ్మెదను. పింగళసూరన కళాపూర్ణోదయము కవిప్రతిభను చూపుటయే కాక ఆంధ్రసారస్వతమున నిట్టిప్రతిభాశాలురగు కథానిర్మాతలున్నారను గర్వకారణమగుచున్నది ప్రభావతీప్రద్యుమ్నము నెఱుగనివారాంధ్రభాషా పరిచయము లేనివారని చెప్పుట యతిశ

యో_క్తిగాకున్నను మాధుర్యము ఇట్టిదని తెలియనేరని వారి నిదైన చెప్పవచ్చును. రాఘవ పాండవీయము ద్వ్యర్థి కావ్యము. భీమకవి గ్రంధము వ్యాపకమువ లేనందున నిదియే ప్రథమ మని చెప్పవచ్చును. భట్టుకవి శ్లేష పెక్కు_నెడల దీనిమించి రుచ్యమగును. అదికథావస్తువుననుగలదు రామకృష్ణకవి వికటకవియని లేనిపోని కథలు హేయము లై నవి వానికదికిన చరిత్రిలున్నవికానియవియవిశ్వసనీయములు. ఈతఁడుచక్క_ని విద్వాక్క_వి. ప్రౌఢకవిత్వము చెప్పువాడు. ఈతని చాటువులే వీనిప్రజ్ఞాతిశయములు నెఱుక పఱచును పాండురంగమాహాత్మ్యము శైలి శ్లాఘూపాత్రము. దీనికొకవ్యక్తిత్వము ప్రత్యేకత గలవు (Individuality & Speciality)

"అల్లసానివాని నల్లికజిగిబిగి, ముక్కు_తిమ్మనార్యు ముద్దుపలుకు, పాండురంగవిభుని పదగుంభనమ్మును ......నీకుతగుర"

అని రామకృష్ణుఁడు కవి నుద్దేశించిచెప్పెను. వీని దశావతారపద్యములు అత్యంత కఠినములు. రామభద్రుని రామాభ్యుదయము మృదుశయ్యగలది. ధూర్జటికవి కాళహస్తిమాహాత్మ్యము శబ్దార్థములరెంటిని గణనకెక్కి_నది. ఇందుమతీపరిణయముగూడ వీనిదేయని కొందరు. ఈధూర్జటికవిగూర్చి యొకకథయు గలదు.

"స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటిపల్కు_లకేలఁగల్గెనీ, యతులితచాతురీమహిమ"—యని రాయలు అస్ఖలిత

బ్రహ్మచారిగ దాయనిధూర్జటివిషయమునసందియపడువాఁడట. శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానము పేరొకనఁదగిన గ్రంథము ఈహరిశ్చంద్రకథనే గౌరన ద్విపదకావ్యముగ రచించెను.

ఇవియటుండ ఒకటి మఱువరాదు. రాయలు వీరినం దరిమించిన ప్రౌఢకవి. వీని యాముక్తమాల్యద (విష్ణుచిత్తీయము) వీనినన్నిటి నతిక్రమించు కాఠిన్యముగలది. దాని యుత్కృష్టత ముండ్లచే నావరింపఁబడి పొదబడియున్న గులాబివలె సులభసాధ్యము గాకున్నది. కంటకావృతమగుటచే మొగలినివలె కొందరు దీనినివెదకి గ్రహింపఁజాలక విడుచుచున్నారు. ఇదికావ్యమనుటకంటె మత వేదాంత చర్చయనుట పిలుకాని శైలియు వర్ణనలు అపూర్వములు. పింగళిసూరన, శ్రీనాథుఁడు వీరికావ్యములు కేవల కవనములుగాక చరిత్రకు వలయు సామగ్రినీఁజాలినవి.

ప్రబంధకవులు పెక్కుమంది వీరిననుసరించిరి. జక్కన విక్రమార్కచరిత్రము, వేంకటాచలకవికృష్ణవిలాసము, రసిక జనమనోభిరామము, కవికర్ణరసాయనమున్నగు నెన్నియో కయితలు బయలుదేరినవి. ఇందు తారాశశాంక విజయాదు లటుంచి, చేమకూర వేంకటకవి విజయవిలాసము లోనగునవి ప్రాముఖ్యముగలవి.

విజయనగరరాజ్యము క్షీణించినపిదప నాంధ్రసారస్వతము తగినపట్టుగొమ్మలేక యట్టిటు దశదిశలఁబోయెను. తిరుమలరాయలు పెనుగొండలోదాఁగి పిదప చంద్రగిరిపోయి

అటక్రమముగ మంత్రియై రాజయ్యెను. ఆంధ్రవాణియు అటు చంద్రగిరివైపు, దక్షిణమున తంజావూరుమధుర వైపు, నిటుబొబ్బిలి, విజయనగరము, పెద్దాపురమువైపు పలాయన మయ్యెను. మొదట రాయలు మరల తెలుగుకవులబోషించెను. చేమకూర వేంకటకవి విజయవిలాసము తెలుఁగు కయితలకు సానరాయి. బాససొంపునకు పాడిపంట. వ్యంగ్యధ్వని భూషితము. శిరీషసౌకుమార్యముగలది. వ్యాకరణోల్లంఘనలుకాలవు ఇట్టిదికాకపోయినను, రసములొలికించునది అనంతామాత్యుని భోజరాజీయమొండుగలదు.

తరువాతవచ్చిన కవులలోఁగూడ నెన్నికగొన్నవారు లేకపోలేదు. వీరిలో పిండిప్రోలు లక్ష్మణకవి సంకుసాల నృసింహకవిగూడముఖ్యులు. ఈనృసింహకవి కవికర్ణరసాయన కర్త. లక్ష్మణకవి రావణదమ్మీయము వ్రాసెను. ఈసందర్భమముననే కూచిమంచిజగ్గకవిపాత్రము చెప్పవచ్చునుశిష్టు కృష్ణమూర్తివ్రాసిన ఎన్నికగుచాటువులునుగలవు హరిశ్చంద్ర నలోపాఖ్యానము రావణదమ్మీయము మొదలగుద్వ్యర్థికావ్యములుగూడ అవతరించినవి. ఆంగ్లభాషలోవలెవ్యక్తిగతము(Personal) లగు వ్రాతలు రావణదమ్మీయ మునగలవు. ఋగ్వేదికవి వెంకటాచలపతికవి 'చంపూరామాయణము' పొగడఁదగిన గ్రంథము. సంస్కృతమునవలె ఆంధ్రముననుచంపూరచనమును జూపెను. అడిదము సూరకవి పూసపాటివారి సంస్థానమున నున్నవాఁడు. ఈతడు శాపానుగ్రహసమర్థుడు.

'పెట్టినవిందు, పెట్టుకున్న మందు' చాటుకవి హాస్యోక్తులుగలవు. కవిజనరంజనము రచించెను. వసుచరిత్రఇదియొక పిల్ల కూచి మంచి తిమ్మకవియు వానిసీలా సుందరీపరిణయము మున్నగు నవియు పేర్కొనవలసినవి. పైడిపాటి లక్ష్మణకవి రచించిన ఆంధ్రభాషా నిఘంటువు మొదలగు గ్రంథములు కలవు. దూబగుంట నారాయణకవి రచించిన పంచతంత్రము ప్రసిద్ధ మైనదే. ఈసారస్వత చరిత్రమున తప్పక నెఱుఁగదగినవారు ముద్దుపళని తరిగొండ వేంకమాంబ, మొల్ల. వెంకమాంబ వేంకటాచలమాహాత్మ్యమును రచించెను. ఇది సులభశైలి కలది. మొల్లరామాయణ మందరునెఱిఁగినదే.

ఈకాలమున శతకరచన మధికమైనది. ఇందు వేమన శతకము చాలనాణ్యమైనది. ఇందమూల్యాంశములు గలవు. రాజకీయ, నైతిక, సాంఘిక విషయములు పండితపామరుల కందుఁబాటున నిమిడియున్నవి. కాసుల పురుషోత్తముని ఆంధ్రనాయక శతకము (శ్రీకాకుళాంధ్రదేవయని సంబుద్ధి) నొకటికలదు. శృంగారభరితుఁడగు ధూర్జటియే రచించెనందురు కాళహస్తీశ్వర శతకమొకటిగలదు. ఇది చాలవైరాగ్యోప దేశము కలది. మానసబోధమునిట్టిదే. ఇటీవల పెక్కులువెలు వడినవి. దాశరధిశతకముపఠన యోగ్యమైనది. 'ఇందు' శతకమువంటివి.రసవంతములగునవి నింకచాలగలవు. మతవి షయ ద్యోతకములగు వృషభాధిపశతకములు గలవు. భక్తచింతామణి శ్రీసూక్తివసుప్రకాశకము నిట్టివేయనిచెప్ప

వచ్చును. ఈశతకమునకు ఆదర్శముబహుశః భర్తృహరి నుభితము కావచ్చును నని మాయూహ (లక్ష్మణకవి ఆంధ్రీకరించినది.) కవిచౌడప్పధోరణి మఱొకమాదిరి. భాస్కర శతకము ప్రసిద్ధమైనది. కృష్ణ, నరసింహ, సుమతిశతకము నీత్యుపయుక్తములు. ఇటీవల శతకముల శతకకవుల చరిత్రలే వెలువడుచున్నవి. ఈశకములు బహుధా దేశమున కుపకరించుచున్నవి. వీనివలన పెక్కువిషయములు (నాగరకత, ఆచారములు, విమర్శనలు) విశదముగాఁగలవు.

చరిత్రలులేనిలోపము మనవాఙ్మయమున నింకొకరీతి నిగూడ దీఱుచుండెడిది. బొబ్బిలిరాజులు, విజయనగరము వారు (తూరుపురాజులు) వీరిచరిత్రములు వర్ణించు నుత్కృష్ట గ్రంథములరుదు. కాని పూర్వముననే వెలువడిన 'రంగనాథ రామాయణము ద్విపదకావ్యములలో మొదటిది. శ్రీనాథుని పల్నాటివీరచరిత్రము చరిత్రాంశములుగలదై చదువుకొలఁది నుత్సాహకరమై, వీరరౌద్రపోషితమైయున్నది. బొబ్బిలికథ, కామమ్మకథ ఇట్టివి ప్రజాసామాన్యమునకు బోధపడునటులు (మంజరీ) ద్విపదాదివృత్తములలో నుత్సాహోద్రేక పూరితవర్ణనములలో స్వదేశస్థుల శౌర్యసాహస విక్రమాదులు గంభీరముగను విపులముగనువర్ణింపఁబడి కీర్తింపఁబడుచుండెడివి ఇవి యక్షగానముల జాతిలోనివే. ఇట్టివి చాల గలవు. ముద్రణములు పూర్వము లేకుండుటచే సూత్రకాలమునుండి వచ్చుచున్నపద్ధతినే పాఠములవలన ముఖాముఖిగా తరతరములనుండి నశింపక నిలిచియున్నవి. తాటాకులలో వ్రాయు

టయు గురుముఖతః శిష్యులకు పాఠములై వల్లెవేయఁ బడు
టయు వంశపారంపర్యముగ వచ్చినవి. వినుటకు వీనియందుఁ
గూడ రసపుష్టియును నొకసొంపును లేకపోలేదు. భాషాపరి
జ్ఞానమున నివియు గొంతవరకు సహాకారములేయని నాగ
ట్టినమ్మకము. వీనియెడల అధునాతన నాగరికులవి తమ భావా
త్కృష్ట్యమునకు భంగములని కావలయు (శీతకన్ను) నిరసన
దృష్టిఁ బఱపుచున్నారు. ముద్రణాలు నిషేధములుగల యీ
రోజులలో కవులరచనలు దేశచరిత్రలు, ప్రతాపశాలురగు
మనదేశమువారి పౌరుషములు పరాక్రమములు నెట్లువ్యాప్తి
గలిగి ప్రచారమున నుండఁగలవు? మనపూర్వీకుల నాగరక
తలు, కళలు, శాస్త్రములు నశించినట్టి నిర్భాగ్యస్థితియే
పట్టవలసివచ్చును. పరరాజులు వ్రాసి చెప్పిన నిజానిజములే
మనకు విన్నన్న చెప్పిన వేదములు కావలసివచ్చును. పత్రి
కలలో నిజమైనవార్తలు రానివిషయము మనకుప్రత్య
క్షము. కూపస్థమండూకవృత్తాంతమునకేమియు భిన్నము
కాకయున్నది. అట్టినిషేధక శాసనములయందును 'దండాలు
భరతమాత' యనునదియెట్లు వ్యాప్తినొందినదో గమనిం
చఁదగిన యంశము.

కవిత్వచారిత్ర సంగ్రహమిటుండ నింతదనుక వచన
రచనము తెలుఁగుభాషలో నెవరునుఁ దలపెట్టలేదు. పరవస్తు
చిన్నయసూరి నీతిచంద్రికను చాలవరకు సంస్కృతపద
మయముగనే తెలుఁగురచనసూపెను. కళువె వీరరాజు, చద

లువాడ సీతారామశాస్త్రి, వీరభద్రాచార్యులు లోనగువారి రచనములు నేడు ప్రకటనగావించినవి. ఇవి యన్నియుఁ బ్రౌఢ శబ్ద గుంభితములుగఁదోచును. (భాషార్ణవము ఆంధ్రనామ సంగ్రహము లోనగునవి పద్యములు.) శబ్దరత్నాకరము సీతారామాచార్యులవారిచే సమకూర్పఁబడెను. ఇదిఅన్యపద్ధతి. ఆంధ్రభాషాభూషణము, కవిజనాశ్రయము ఇవియు తెలుగుభాష నభ్యసించువారల కుపయుక్తములు. (అప్పకవీయము, సులక్షణసారము, ప్రౌఢవ్యాకరణము,లను ప్రత్యేకముగ చెప్పలేదు.) ఇట్టియెడవచన (వ్యాస) రచన కందుకూరి వీరేశలింగముగారి చేతను చిలకమర్తివారి చేతను వెంకటశివుడుగారి చేతను గ్రంథరూపమగు నవలరూపముదాల్చినది. మఱి ప్రస్తుతము ఆంధ్రసారస్వత చక్రము గమనమున వేఱొక పరివర్తనము నొందినది.

హూణభాషా సంప్రదాయములు తలకెక్కినవి. 'క్రొత్త వింత పాతరోత'యని యాక్రొత్తరుచు లూటలూరించి యిందుఁజొచ్చినవి.ఇక రాజాదరణలేదు.తీఱికగలవారును అభిమానముగలవారునెవరోతక్క తెలుగుసరస్వతినాదరించినవారులేరు. బ్రదుకలేక బడిపంతులన్నట్లుపాఠశాలలపాలైనది.వీరినిఇంగ్లీషు భాషావాసన వశముచేసికొనినది, కందుకూరి వీరేశలింగము గారు స్వీయచరిత్రము, ప్రహసనములు, వ్యక్త్యుద్దిష్టములు (Personal) అక్షేపకములు (Satires) వెలువరించిరి. ఏలనో ఇంగ్లీషులోవలె స్వాత్వికత(Egoism) తెలుగుభాషలో నింకను

హెచ్చుగాగానరాదు. జాన్సన్ (johnson) వ్రాసినట్లు (Poet is the poorest wretch అని) Goldsmith మొదలగు వారియంత లీకవులకంతఁగఁబట్టలేదు. భుక్తికొరకు (For bread) వ్రాయుట చాలఅరుదు. వీరేశలింగంగారి గాడిదకథలతోఁ బాటు విధవాఘోషలతోఁ బాటు నీతిచంద్రికయు, మఱి కొన్ని చక్కని గ్రంథములును మనకులభించినవి. వడ్డాది సుబ్బరాయఁడుగారును కాలేజీలో అధ్యాపకులై చాలగ్రంథముల వ్రాసిరి. వీరికవనమున సరళగమనము తక్కువ. ఏరుకొనుపదములో పొందికకన్పట్టదు. నడకపట్టి పట్టియుండును. కాని భావములు చాలసరసములు.

ఇప్పుడే తెలుగునాటకము లవతరించినవి. ఇతరగ్రంథములవలెనే మొదటిస్థితి సంస్కృత నాటకాంధ్రీకరణము. బళ్ళారివారి చిత్రనళీయము, చిలకమర్తివారి గయోపాఖ్యానాదులు దక్క నూటికి ఎనుబది సంస్కృతమునుండియే దిగినవి. సుబ్బారాయుడుగారి శతకములు నాటకములు, చాలగలవు. భక్తచింతామణిగణనకెక్కుటకు బ్రహ్మసమాజమతము తోడ్పడినది. వారిశిష్యులు వారిదగ్గర చదువుభాగ్యము తమకుగదా యబ్బెనని గర్వించి చెప్పుటవారిబోధన శక్తి తెలుపును. చిలకమర్తివారు నవలలుగూడరచించిరి. వీరిశైలిచాల సులభము. పేలవమని కొందరందురేమోకాని సామాన్యమును బాగుగనాకర్షింపగలది. వేదము వేంకటరాయశాస్త్రి గారి వ్యాఖ్యానము లమూల్యములు. వీరిపాండిత్యము పూర్వ

పండితతుల్యత నందఁగలది. ఆముక్తమాల్యద మున్నగు పెక్కులీయన వ్యాఖ్యలువడసినవి. కాని వీరు కవిత్వమును వ్రాయఁబూనుట భాషాసరస్వతికిఁ జిన్నచూపేయనుట సాహసముకాదు. మల్లినాథుఁడు కాళిదాసాది మహాకవుల వ్యాఖ్యాతయేకాని కవిత్వవాణి వానిదఱి చేరనొల్లదు. వెంకట్రాయశాస్త్రిగారు సల్లేభాషకుజనకసములు గావచ్చునుగానియన్యభాగమనేచ్ఛ నొందుట ప్రమాదవశమే, వీరేశలింగముగారు వసురాయలు వేదమువారు సంస్కృతమునుండి నాటకములఁ దెనింగించిరి కాని వీరిలో వీరేశలింగముగారి చేతయే మధురము. వీరి శాకుంతలము హృద్యమైనది. వీరికిపూర్వము పూడభూషివారు (ఆచార్యుఁడు) సుప్రసిద్ధులు. ఏనాఁడో భట్టుకవి కనుపఱచి విడిచిన శతవధానప్రజ్ఞల నీయన పునరుద్ధరించి సరసకవిత్వమునుఁ జెప్పెను.

ఈయదనున బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వరులు (కవిద్వయము) ఆంధ్రవాణినిఁ బోషింప బద్ధకంకణులైరి. శేషాద్రిరమణకవులు, వేంకటపార్వతీశ్వరులు, వేంకటరామకృష్ణకవులు, మఱి యిమిటేషన్ రాలవలె పిల్లపిల్లకవులు (అందరు జంటలేకాని దంటలుకానరారు) తెలుఁగు వాణికి యథాశక్తి సేవసల్పిరి. శేషాద్రిరమణకవులు పాఠశాలలలోవారే. వీరు వ్రాయుచు కొన్ని పరిశోధించుచు, విమర్శించుచు భాషాసేవకులైరి వేంకటరామకృష్ణకవుల కవిత్వము రసవంతమే. వీరు వృద్ధిలోనికి రాఁదగినవారే కాని వాదప్రతివాదములలో

ముధాప్రతిభులై పూర్వకవుల యపరాధములు, కోకిలకాక ములు, వీనితో గడపిరి. వేంకటపార్వతీశ్వరకవులు సరసకవు లేకాని వీరినవలలు చాలవరకు ననువాదములే (బంగాళీ లోనివి) వీరిగీతములు చదువుటకు చవులుగొలుపునవే వీరిప కాంత సేవమనుగడగలదియునినమ్మెదను.

"వింటేభారతము వినవలె తింటేగారెలు తినవలె" నన్నట్లు ప్రసిద్ధభారతమునకు గీరతము వ్రాసి, భారతనాటక ములురచించి 'జెండాపై కపిరాజు,' 'చెల్లియొచెల్లకో తమరు చేసినయెగ్గులు' కండ్లకుకట్టి ఆంధ్రదేశమును తమశిష్యులతో నింపి నవీనమగు సులభశైలి, మార్దవము, అభిప్రాయ గౌరవ ముగలవారై శతవధానములాచరించి దిగ్విజయముగావించి తిరుపతి వెంకటేశ్వరకవులు నానారాజసందర్శన గ్రంథకర్త లైరి. వీరు విశాఖదత్తుఁడు మున్నగు వారిని తెనిఁగించిరి. ఆంధ్రభాష శృంగారవతియై దేశమంతయు నృత్యముసల్పినది. ఉద్యోగము కొఱకు హూణభాషాదాసులగు దినములలో తెలుఁగుభాస చదువవలయుననునభిలాష వీరివలన జనించినది. వీరి దేవీభాగవతము, శ్రవణానందము బుద్ధచరిత్రము శాశ్వత గ్రంథములలో చేరగలవు. వీరుప్రబంధ నాటక శతక కవులు. అష్టకములు శుకరంభాసంవాదముకామేశ్వరీ శతకము చదువ దగినవి. వీరికలమునవెలువడిన ప్రతిగ్రంథము రసముచిప్పిలు ననిన నధికోక్తిగాజాలదు. అడవి సాంబశివకవి దాసుశ్రీరా ములుగార్లు ప్రఖ్యాతిగన్నవారు దాసువారి దేవీభాగవత

ముత్కృష్టమైనది. పానుగంటివారు వచనమునకు మెఱుగుదీగె వంటివారు. వీరి జంఘాలుఁడుచాలవిమర్శకుఁడు. ఇంగ్లీషు నిలో Addison, Goldsmith లను స్మరణకుదెచ్చును, వీరినాటకములును హాస్యరసమున రంజింపఁ జేయునవే.

ఆంగ్లభాషానుసారిణియై తెలుఁగుభారతి నూత్నపథముల నడుగులిడసాగినది. గురజాడ అప్పారావుగారి కన్యాశుల్కము ఉత్కృష్ట గ్రంథమును వైమర్శకమును సాంఘికోత్తమమునగును గాని భాషాసాంకర్యమొక భిన్నాభిప్రాయకారణమగుచున్నది. గ్రామ్యవాదములు పెచ్చు పెరిగినవి. అట్టి సమయమునను కేతవరపు వేంకటశాస్త్రిగారి గ్రాంథిక వచన రచనములు పండితుల కంధకారమున వెలుఁగు దివ్వెలైనవి. బ్రహ్మయ్యశాస్త్రిగారు నీవిషయమున గౌరవనీయులు. వీరివిమర్శనలు మంచివి. కేతవరపువారి రాయచూరు యుద్ధమువారిమనీషను చాటుచున్నది. అటుపైన మహాపురుషుల జీవితములు (biographies) వ్రాయు సంకల్పము లంకురించినవి.

వీరేశలింగముగారి కవులచరిత్రతో గురజాడ శ్రీరామమూర్తిగారికవిజీవితములు బయలువెడలెను. ఆంధ్రపత్రిక ఆంధ్రకేసరి, కృష్ణాగోదావర్యాది పత్రికలు తలచూపినవి. ఇందాంధ్రపత్రిక కృష్ణాపత్రికలే చెప్పదగినవి. కృష్ణాసంపాదకులు కృష్ణారావుగారి వ్రాతలు భావవ్రాతములు. భాషాసేవ యొనర్చుచున్న ప్రముఖులలో, వంగూరి సుబ్బారావుగారు చెలికాని లచ్చారావుగారు చిలుకూరి వీరభద్రరావుగారు,

జయంతి రామయ్యగారు కొమర్రాజు లక్ష్మణరావుగారు ప్రశస్తిగాంచిన నర్షులు. వీరు దేశసేవ సేయుచు చరిత్రలు పరిశోధించుచు సంచారము చేసి అముద్రిత గ్రంథములు వెదకి శాసనములు చూచి ప్రకటించుచు వచ్చిరి. వీరిసేవ అమూల్యము. ఇంగ్లీషుబడులలో చెప్పు అబద్ధచరిత్రలు హిందువుల ననాగరికులని పశుతుల్యులని చెప్పుకాలమున నిట్టివారి పరిశోధనలే సత్యాన్వేషణమున కాధారములు. వేలూరి సత్యనారాయణగారివిఖ్యాతస్మరణీయములే. భాషావీక్షణములు నలుదిక్కుల ప్రసరించుటచే, ప్రకృతిశాస్త్రములు, చరిత్రలు, రాజకీయములునగు గ్రంథములు పురికొల్పఁబడినవి. రాజప్రాసాదములనుండి బయటపడి, పెద్దనాదుల తూగుటుయ్యాలలనుండిజారి, ప్రభువుల సన్మానములరోసి తెలుగువాణి ముద్రాలయాధికారులఁ జాలినిఁ బెఱుగుచు, పరనాగరక సాంప్రదాయముల కలోనై విభృతుపీడి యూఁతనిచ్చినవారినెల్లదిక్కనినమ్మి పత్రికాప్రాచుర్యమున కాలముగడపు రోజులు ప్రాప్తిల్లినవి.

'వేషభాషలకట వెట్టికాదు' 'ఉదరపోషణార్థమయం పటాటోపః' అనిదుస్తులుధరించు బాలకవికూటములనుఁ గని తెలుఁగుభారతి భ్రాంతివడినది దృక్పథము మార్చినది. చలచిత్తమైనది. సమాజములు, సమితులు, కుటీరములు లేచనెత్తినది. ఏమిచేయఁగలదు. ఆంధ్రవాణినాదరించు నంతఃపురము లడుగంటినవి. సన్మానించుసభలు సమసినవి.

ఇప్పుడు తన్ను ప్రతిఘటించి తనపేరుతో వెలసి సంప్రదాయసిద్ధములగు లక్షణములు వీడి శ్రోత్రపేకడల కులుకు భారతాంగనలవినోదములమనోవేదన వడినది. నవ్వింపయత్నించు మోటు దనమునకు జుగుప్స వడుచున్నది. బూతుసంచికలవంటి విపరీతయువకుల యున్మాదలేఖల వెలవెలఁబోవుచున్నది. సంప్రదాయముగల కుటుంబములఁ బుట్టిమెట్టిన చోటుల పుణ్యమొదవించి గృహలక్ష్ములు గాఁగల సేవాధురీణల కెదురు చూచుచున్నది. పెడదారుల ద్రొక్కని పిన్న పెద్దలకు భిక్షవెట్టుచున్నది. అభిమానించు ప్రభునాశ్రయములు పరిషత్తులు పాడువడినవి. తావులేక తలదాచుకొనుట కున్మాదినియై యూర్మిదూలినది. గుంటూరు గుంటల నెల్లూరు నెఱజాణల యూసుల నుస్సు రుస్సు రనుచు రైలు ప్రయాణములలోచిక్కి మాలిన్యమంటి విలపించుచున్నది. ఇటీవల కృష్ణాపత్రికలో 'రసమంజరి'గనికొంతవికసింపనుత్సహించినది. బందరులో'శారద'గనిసంతోషపారవశ్యమునందినది.

గ్రహదశలు మాఱుచుండును. రాయప్రోలు సుబ్బారావుగారి కవితాంజలి,జడకుచ్చులు మొదలగువానితోనొక్కొక్కతఱికులుకును. సెలయేటి గానమువినును. కాలకాంతఁ గని నవ్వును. హంపీయాత్ర దలఁచికొనిన కొలఁది విలపించును. ఆంధ్రప్రశస్తిగనియట్టెనిట్టూర్చును. ఏకాంతసేవలకెఱగును. తొలఁకరితొంగిచూచును. మఱియుభావకవుల ప్రభావమునకుఁ దాళఁజాలక ప్రాలుమాలియుండును. ఆంధ్రపత్రికలలోనిసారస్వతానుబంధముపై కొన్నినాళ్లు దృష్టిఁ బఱపి విధినిదూఱుచు

(వేషధారులగు పాశ్చాత్య విద్యాగరిష్ఠుల కరస్పర్శకు) నొక కంటనీరు గార్చుచు కాలము పుచ్చుచున్నది. తెలుగుభాష సాహితీపటిమ, భావసునుపేర పెన్గయులలో మునింగి తేలినది. దరిగానక యున్నది. కిన్నరభాషిణి యగు తెలుగు భారతి మంజులక్వణములు ప్రణయప్రశాంత్యాదుల యుపసర్గనిసర్గల లోఁబడిలీనమైనది. హోరుమనియేడ్చునవయువకులగనివివ్వెక వడుచున్నది. లేనిపోని విరహతాపముల వేగివేసరి ఇరుగు పొరుగుల విసిగించువెంగలి మక్కువలకు వెగటువడుచున్నది. బాలకవులు మున్నగు వారి పంపుగకట్లు ములందియు, ఇంగ్లీషు చదువరుల నిరంతర బలాత్కారమున వెఱగువడుచున్నది. తలమాపుసూపు పెద్దచుట్టులఁ గని సాహితికిఁ దూరదూర ముగ పరుగిడుచున్నది.

ఇట్టి వర్తమానస్థితిని క్రొత్తనాగరికుల(Romance)లకు రోయుచు చిల్లరకవుల చేతుల గొల్లు మనుచు, (Mystic) (అయోమయగుప్తార్థ)రచనల చేరససముద్రోదకముల భావకల్లో ల తరంగముల నుక్కిరిబిక్కిరియగుచు ఆంధ్రసరస్వతి యీాదు లాడుచున్నది. పాశ్చాత్యకవ్యాదర్శములే పీడాకారణములని నేను చెప్పను. అందమూల్యరత్నములు ప్రకాశించు చునే యున్నవి. చెట్టు చెడుకాలమున కుక్కమూతిపిందె లనునట్లుభాషావృక్షము వెఱ్ఱితలలు వేయుచున్నదా యనుసం శయము పలువురకు గలుగుచున్నది. 'తొలకరిమెఱుపుల' వంటివి మంటిలోమణులవలె నేటికిని మెఱయుటచే సూర్య చంద్రులు గతితప్పక ఋతుధర్మములు తలక్రిందులు కాకుండ

టచే కలకంఠ మనోజ్ఞములగు నామని వేళల పూలగుత్తులతో కారుమబ్బులఁబాసినశరద్రాత్రుల వెన్నెలలలో, నెడనెడనేకొంద రేని కాలకాంతానురక్తినిసూత్రగొని అభిమతముదీఱఁగావించు బుజ్జగింపులతో కలికర్ణానందములగు గీతములతోఁ కవితాసర స్వతికప్పు డప్పు డూఱటనొంద తావలమేర్పడుచున్న

భాషాజీవితములలో నవస్థాభేదము లేదేశమున నైన గానవచ్చును. ఇదియు సట్టివానిలో నొకటియని సమా ధానము చెప్పినచో తెలుఁగుకైతకు మతిభ్రంశత్త్యులమగు నవస్థయని చూపర సిగ్గుయంతురేమో! వనకుమారులను, కృషీవలులను గని వనట మఱచును. సుక్షేత్రముల స్వైర విహారము సలుపును. జాతిమతభేదములకు ప్రాధాన్య మొసగక "గుణాః పూజాస్థానంగుణిషు నచలింగంనచవయః" యని పిరదాసీవంటికవుల తలచికొనుచుండును. బౌద్ధాగమమైన సౌందనందమును నభినందించును.

వెఱ్ఱికి వెయ్యివిధములుగదా. కొంతకాలము లేఖనవై చిత్ర్యమును, కళాభిజ్ఞతయు, శిల్పనైపుణ్యమును, ప్రకృతిసౌంద ర్యమునెల్ల శివుని పెంజడల వంటి పెద్దజుట్టులలో కట్టిపెట్ట నూ హించిరి. నాఁడుభాషానతికి 'పరమనీచ' దినమేకాఁబోలు.

అంధకారములోముంచి యదేపనిగానల్లాడఁజేసి దేవు రింపఁజేయు కృష్ణపక్షములువచ్చినను కొలఁది వెలుతురే నొసఁగికనులకుకట్టినట్లులుగఁజూపి బయలుపెట్టఁగల శుక్లపక్ష ములు వానివెనుకనే వచ్చుచుండునుగదా.

---

రాజమండ్రి రామమోహనప్రెస్ నందు ఒకటవపేజీనుండి
34 పేజీవరకు ముద్రితము. 1935.

శ్రీరస్తు

# HISTORY OF DRAMA

కావ్యేషు నాటకా రమ్యాః.



కవికృతమైనది కావ్యము గదా. అవి ద్వివిధము లగుచున్నవి. శ్రవ్యములు, దృశ్యములు. శ్రవ్యములు ప్రదర్శనీయములు గామి శ్రోత్రప్రియములు. ఇట్టివి విజయవిలాసము మనుచరిత్రము మొదలగు ప్రబంధములు నితరగ్రంథములు; దృశ్యములు, నేత్రానందకరము లగునవి. చిత్రనళీయము, హరిశ్చంద్ర, పాండవవిజయము, శాకుంతలము వీనిలోఁ జేరినవి.

గ్రంథరచన మనిన నీకాలమున 'నంబికొండయ' వలెనైనది. తృటిప్రాయముగ భావింపఁబడును. పరీక్షలు తప్పిన ప్రతివిద్యార్థియు తీఱికగల యెల్ల ఇంగ్లీషు విద్యాగరిష్ఠులు కట్టగట్టి సమకట్టిన యవలీల ప్రయత్నము. సరి, విద్వాన్ ఉభయభాషాప్రవీణలకు చదువఁదలఁచిన వారి కుగ్గుపాలే కవిత్వము. అందులోఁ గ్రొత్తపద్ధతియైన మఱి మంచిది. ఇక సంస్కృత శిరోమణులకు జన్మహక్కే యగుచున్నది. పూర్వకాలమున

అనఁగాభూమిపుట్టిన(శైశవదశలో)(When the earth was young) రోజులలోనని, నేటి మనసంకరపండితులు వ్యవహరింపని కాలమున, ఆత్మసాక్షి (Conscience) గల కాలమున, నాగరకత మితిమీఱని కాలమున అట్టి పంతముబట్టి రచించు సాహసమున కొడిగట్టువారు లేరని నాయూహ. శాస్త్రశిక్షణము నొంది సాహిత్య జ్ఞానము సంపాదించి లోకవ్యవహారములు దెలిసి శుచిగలవారై ప్రతిభాపూర్ణులై, కారయిత్రీ భావయిత్రీ శక్తియుక్తులై, భుక్తికివెదకు నవసరము లేనివారై తీటికలు గలిగి ప్రభువుల సన్మానాదరముల సంతుష్టిపడయుచు దాంభిక వృత్తులకు దూరులై భాషాసరస్వతితో ముఖాముఖి ప్రసంగించుచు లక్ష్మీమందిరముల నునికిగొని యే కొందరో యర్హులగు వారే యిట్టి యుత్కృష్టకృత్యములను జేయదొడఁగిరి. అట్టివారి యవ్యవహితరచనములతో నేటి మిథ్యారచనలు చేర్చి నేర్చుట పాతకహేతువే యగును. అందు సామాన్యగ్రంథములకు మించి నాటకరచనము కష్టతరము. దీనిలో నియమము లెక్కువ గలవు. బుద్ధివైశారద్యము అధికముగా వలయును. (Study of men and matters) కనుకనే అట్టివ్యుత్పన్నమతియగు షేక్స్పియరు మహాకవి యతీతుఁడగుట (His characters are living and there is Psychological understanding) అట్టి నాటకరచనకు ఉపకరణములెన్ని యవసరము! పరికరములు లేక వ్రాయఁబూను నేఁటి రైల్వే గ్రంథకర్తలవంటి మహామహులు లెట్టి

లోకోపకర్తలో పాఠకులెఱుఁగుదురు. ప్రతిప్రయాణికుఁ డెఱుగును.

"Poets are the uncknowledged legis laters of the world"

కవులకలములు చాల సత్తువ గలవి. ఎట్టి శాసనములును, చట్టములును వానిని మించజాలవు. వీరి వ్రాతలచే క్షణములో ప్రపంచమును తారుమారు చేయవచ్చును. అందునను శ్రావ్యములకన్న ప్రత్యక్షముగఁ జూపుదృశ్యములలో నెక్కువ శక్తి గలదు. దేశమునగల సౌభాగ్యతలు మంచిచెడ్డలు నంత చక్కగ నేరిమనసునను నింకొకవిధముగ నాటవు. మోలియర్, బెన్‌జాన్సన్, షేక్స్పియరు వారివ్రాత లెట్టి పరిణామములకు లోనయ్యెనో మిల్టన్ మున్నగు కవులలేఖను లెట్టిశక్తిమతులయ్యెనో ఎడ్డిసన్, గోల్డుస్మిత్, డికెన్స మొదలగు కర్తల యీదేశము లెట్టి ఫలవంతములో, వేయేల? వార్తాపత్రికల యుద్బోధన మెంత యమోఘమో యెంత నిరాఘాటమో (వానికి వెలచిగదా ప్రెస్సుఆర్డినెన్సులు) ఇంగ్లీషుచదువు విద్యార్థులకు తెల్లముగాఁ గలదు. అట్టివారు కవులు. ఏభాషనైన నీపోలిక యొక్కటే. సాంఘిక దురాచారము లడుగంటుటకు కాని, రాజకీయ సమాచారముల యుద్బోధమునకు గాని, నైతికవిషయ ప్రచారమునకుగాని గ్రంథములవంటి యుపకరణములు, కవులవంటి గంధవహులు వేరెవరు? ఏకాలవు ఆలోచనలు(Thinking element)అవసరవ్యత్యయములు(Chan-

ges necessary) పద్ధతులు (Modes of life etc) ఆచార వ్యవహారములు (Habits and customs) యోగక్షేమములు (Well-being) కాని కొన్ని శతాబ్దముల పిమ్మటఁ దెలియవలె ననిన నాటకాలవుకవుల వ్రాతలు దర్పణములవలె ప్రతిబింబము లీనఁగలవు. (Synchronisms and Anachronisms) సాకాల్యవైకాల్యములు కండ్లకుగట్టినట్లు చూపఁగలవు.

సంస్కృత వాఙ్మయము నిట్టివిషయముల పోడసూపఁగలదు. ఏదేశభాషయైనను మాతృకనుబట్టి తెలియఁదగినది. అదియే గ్రహణపద్ధతికి సక్రమమైనది. భాషాభివృద్ధి వాడుక పదములనుండి పాణిన్యాది పండితులచే శాసింపఁబడి సంస్కృత రూపమునొంది సలక్షణ లక్షితమై అలంకార భూషితమై పతంజల్యాది మహామహులచే విమర్శింపఁబడి బాణాదిప్రతిభాశాలుర హస్తములలోఁ బెటిగి వృక్షమైనది.

వేదములలోని ఋక్సంబోధనలే స్వగతములుగను వాని సమాధానములే ఆకాశభాషితములుగను పరిణమించి నాటకరచన ప్రారంభించియుండును. తెలుగునాటకములకు సంస్కృత కవులుదారిచూపుటయేకాక, యక్షగానములు,వీధిభాగవతములు, భోగముమేళములుకూడ మార్గమునేర్పరచినవనుటలో వైచిత్ర్యముండదు. వేదోపనిషత్పురాణేతిహాస భాష్యశాస్త్రాదిగ్రంథముల పిదప కావ్యాదర్శముల యనంతరము నాటకములు వెలువడినవి. వానిలక్షణములనిచటవిస్తరభీతి వదలివేయుదము.

నాటకములు తొలుత అంతఃపుర వినోదమున (Harem) కేర్పడినవి. రాజకార్యభారము వదలిన రాజానందము ఒక ఎత్తు, శుద్ధాంతకాంతలవినోదము, లోకజ్ఞానసంపాదనము మఱొక ఎత్తు. కనుకనే విషాదాంతములు (Tragedies) గాకుండ కట్టుబాటులు గలిగినవి. ధీరోదాత్తనాయకాది పాత్రపోషణములు శృంగార వీర ప్రాధాన్యములేయగు రచనములు, నైతికమార్గోపదేశములు పాఠములయినవి. పిదప భరతముని యుపదేశించిన నాట్యము (అభినయము) కలియుటచే నయనానందములయినవి. సర్వజనాహ్లాదకర మగుటకు సంగీతసాహిత్యసమ్మేళన మొదవినది. వీధినాటకములు, తోలుబొమ్మలలోని, రాగ, తాళాభినయము లిట్లు వృద్ధినొందినవి. నేటి సినీమాలు శక్తిక్షయము (Waste of energy) లేని (Dumbshows) మూకప్రదర్శనములు. ఇవి ఉన్నతనాగరికతకు లక్షణములట. నాటకరచనలకు బీజములు తొలుత వేదములయందే కలవు. సంబోధనలు సంభాషణము క్రమేణ రంగములుగ మారును. మఱి చంపువులలోఁ గల గద్య పద్యములు వీనికి తోడైనవి. భరతశాస్త్రము, సంగీతమున నభిమానము వీనికి దోహదములైనవి.

ఈనాటక కర్తలలో కాళిదాసుపేరు విననివారుండరు. ఈతని అభిజ్ఞాన శాకుంతలము (German Poet Goethe) గెటీ చదివి ఆనందము పట్టఁజాలక నాట్యముచేసెనఁట! యూరపులో ప్రపంచమున నన్ని నాగరక దేశములలోగల భాషలలోనికిని

దీని ననువదించిరి. ఇందలి నాయకుఁడు ధీరోదాత్తుఁడు. విక్రమోర్వశీయము మాళవికాగ్నిమిత్రము వీని రచనలలోనివి. మాళవికాగ్నిమిత్ర మనునాటకము చరిత్రాత్మకమైనది. అందలి అగ్నిమిత్రుఁడు, పుష్యమిత్రుఁడు, శుంగవంశపురాజులు. ఇది ఆనాటిచరిత్రలు మున్నగు పెక్కువిషయములు దెలియఁజేయును. దీని రచనచే కాళిదాసు క్రీ. పూ 56 సం॥ ప్రాంతమువాఁడని సందేహము. చరిత్రకారు లాతని క్రీ.శ. 525-560 ప్రాంతమున నుంచిరి. భారవియును వీనిసమకాలీనుఁడే. బాణుఁడు (బాణోచ్ఛిష్ట మిదం జగత్) అనునతఁడు (కాదంబరీవచనకావ్యకర్త) కన్యాకుబ్జాధీశ్వరుఁడగు హర్షవర్ధనుని కొలువున నుండెను. ఇతఁడును 6, 7 శతాబ్దములవాఁడు. హర్షచరిత మను వచనకావ్యము రచించెను. ఈకాలముననే దండి యను కవి కావ్యాదర్శమను లక్షణగ్రంథము, దశకుమారచరిత్రము (వచనకావ్యము) వ్రాసెను. బాణుఁడు పార్వతీపరిణయము, రత్నావళి యను నాటకములు రచించెనందురు. కాని రత్నావళి హర్షునిదని నా అభిప్రాయము. హర్షుఁడు రత్నావళి, ప్రియదర్శిక, నాగానంద మను నాటకముల రచించెను. దశరూపకమున నీ రత్నావళి గూర్చిన ప్రశంసయుఁ గలదు. ఇతని నాగానందము అప్పుడు దేశమున వ్యాపించిన బౌద్ధజైన మతాదర్శములు ప్రధానముగాఁ గలది. ఇందు నాందీశ్లోకములో "బోధోజినః" అనుదానిచే స్పష్టము.

'ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే' భవభూతి యను మహాకవి 'ఉత్తరరామచరిత్ర' మను నాటకమును కరుణారసప్రధానముగా రచించెను. కాళిదాస భవభూతి సమకాలీనత్వమును చరిత్రకారు లాక్షేపించి, భవభూతిని అశోకవర్మ (యశోవర్మ) ఆస్థానకవియనియు, పిమ్మట కాశ్మీరరాజు (లలితాదిత్యుడు) వీని నాహ్వానించి యభిమానించెననియు కనుక 7 వ శతాబ్దానంతరమువాడనియు నందురు. వీని 'మాలతీ మాధవీయము' చాల ప్రశస్తికలది. స్వకల్పితకథయనితోచును. మహావీరచరిత్ర మనునాటకమును వీని రచనయే.

పిమ్మట విశాఖదత్తుని ముద్రారాక్షసము గలదు. చరిత్రాత్మకమైన యీ నాటకము అత్యద్భుతమైనకథ (ప్రతిభావిశేషమును చూపునది) కలది. ఇది చంద్రగుప్తునిగూర్చినకథ. ఇది 7, 8 శతాబ్దములలోనిది. భట్టనారాయణుని వేణీసంహారము క్రీ. శ. 850 తరువాత కావచ్చును. ఆనందవర్ధనుని 'ధ్వన్యాలోకము'న దీనినుండి చాల యుదాహరణములుగలవు. ఇతడు అనంతవర్మ కాలమువాడు.

'అనర్ఘరాఘవ' కర్త యగు మురారి చాల ప్రశంసనీయుడు. 'మురారేస్తృతీయః పంథాః' అని లోకోక్తియే వెలసినది. అర్థపదాన్వయకాఠిన్యము గలది. హరవిజయకర్త రత్నాకరుడు (9 వ శతాబ్దమువాడు) వీనిని చాల శ్లాఘించెను సంస్కృతవిద్యార్థులు 'మురారి' చదువక విడువరు.

సుబంధుఁడు 'వాసవదత్త' రచించెను. ఈతఁడు బాణునిచే పేర్కొనఁబడుటచే అంతకుపూర్వుఁ డని చెప్పకతప్పదు.

సూత్రకాలమునాఁటివాఁ డగు పాణినియు (వైయాకరణుఁడు) నొక కవియనియు నాతఁడు పాతాళవిజయము, జాంబవతీవిజయము నను రెండుకావ్యములు రచించెననియు ప్రతీతి. తరువాత రెండువందల యేండ్లనాటి వాఁడగు (క్రీ. పూ. 500 అని కొందరు క్రీ. పూ. 150 యని కొందరు) పతంజలి మహాభాష్యమున వాసవదత్త సుమనోత్తర భైమరథీ అను మూఁడాఖ్యాయికలను పేర్కొనెను. వాటినుండి అలంకారములు, నాటకములు, మహాభాష్యముననే చెప్పఁబడిన కంసవధ, బలిబంధము (కావ్యములు) కానవచ్చుచున్నవి.

ఆధారము లంతఁగాఁ గానరాని పైవాని నటుంచి, నాటకపితామహుఁడగు భాసకవిని ముందు పేర్కొనుట విధి. ఈతఁడిరువది నాటకములు రచించిన ట్లున్నది. కాని అన్నియు లభింపలేదు. (అలబ్ధములలో "కిరణావళి") యొకటి. పాణినీయ విరుద్ధప్రయోగములు పెక్కులు వీనినాటకముల నుండుటచే నితఁడు తత్పూర్వుఁడో సమకాలికుఁడో నై యుండును. (క్రీ. పూ. సుమారు 500 ప్రాంతమువాఁడేమో) ఆధునిక నాటక నియమముల ననుసరించి లేవు. సూత్రధారప్రవేశమున కంతరము మంగళాచరణము. 'ప్రస్తావన' యనుటకు బదులు 'స్థాపన' యని యున్నది. 'స్థాపన' లో కవినిగూర్చి

లేదు. వీనింబట్టి పాణిని పేర్కొను కృశాశ్వశిలాలీత్యాది ప్రాచీన నటసూత్రకారుల మతానుసరణములే యని తోచును. కాళిదాసు తన మాళవికాగ్నిమిత్రప్రస్తావనలో 'భాస సౌమిల్లకవిపుత్రాది మహాకవుల నాకటములమోల బాలుని నూతనుని తననాటకము సభ్యులకు రుచ్యమగునాయని శంకించి "పురాణమిత్యేవ న సాధు సర్వం, నచాపికావ్యం నవమి త్యవద్యం' అని పలికియున్నాడు.

భాసకవివాక్కు సరళము గంభీరము. స్వభావోక్తుల నలరారును. స్వారస్యముగలవి. వీనినాటకములు, 'స్వప్నవాసవదత్త' 'ప్రతిమా' 'బాలచరిత, 'అభిషేకనాటకము' 'పాంచరాత్రము 'మధ్యమవ్యాయోగము, 'దూతవాక్యము' 'దూతఘటోత్కచము' ప్రతిజ్ఞాయౌగంధరాయణము' మొదలైనవి ఇవి రామాయణ, భాగవత, భారతముల ననుసరించినవి. వత్సరాజు చరిత్రమునుగూర్చినవి రెండు. స్వకపోలకల్పితములు, 'అవిమారకము' 'చారుదత్తము' గలవు 'ఊరుభంగము, మున్నగునవి ఏకాంకనాటకములు. వ్యాసమహర్షిచే దారాత్మ్యనిధి యని నిందాపాత్రుఁడగు దుర్యోధనుఁడు ఈతనిచేత గాంభీర్యనిధియై శ్లాఘాపాత్రుఁ డయ్యెను. కాళిదాసాదులు వీనిపద్ధతుల నవలంబించినట్లు 'వీని యభిషేకనాటకము'న రావణుని యశోకవనిక వర్ణించుతటి-

"యస్యాం న ప్రియమండనాపిమహిషీ దేవస్య మండోదరీ
స్నేహా ల్లుంపతి పల్లవాన్" ... ... ...

అని చెప్పినది.

కాళిదాసుని శాకుంతలములో
'నా దత్తే ప్రియమండనాపి భవతాం స్నేహేన యా పల్లవం'

అని యనుకరింపఁబడినది.

ఇట్లే పేరి 'చారుదత్తము' నాధారము చేసికొని శూద్రకుఁడు మృచ్ఛకటికమును వ్రాసి యనేకశ్లోకముల నను సరించి యనుకరించెను. శూద్రకుని శకారశర్విలకపాత్రపోషణ ము హృదయంగమముగాను షేక్స్పియర్ కవినిర్మిత పాత్రిలను (ఆటోలికస్ మొ॥) కొన్నిజ్ఞప్తికి తెచ్చును.

పెద్దలము, సాహిత్యకారులము, పండితుల మనుకొను భ్రాంతిమంతు లెఱుఁగని ముద్దులొలుకు నాటకము మఱొక టున్నది. అది ప్రబోధచంద్రోదయము. కృష్ణమిశ్రివిరచి తము. సంస్కృత భాషలో మహాకవులు కొందఱు తలపెట్టక కొందఱు తలపెట్టి కృతార్థత నొందక విడువవలసిన హాస్యరస మిందు మిక్కిలి పొందికగ పోషింపఁబడినది. ఇది వేదాంతోప దేశము మతప్రతిష్ఠ ప్రధానాశయములుగాఁ గలిగియు సులలిత కవిత్వమున నవరసభరితమై యున్నది.

పిమ్మట జయదేవ, క్షేమేంద్ర, జగద్గురు, జగన్నాథ పండితులరచనలు పెక్కు లున్నవి.

ఇట్టి సంస్కృతనాటకముల నాధారము చేసుకొని ఇటీవల నొక ఏబదియేండ్ల లోపున తెలుఁగు నాటకములు వ్రాయ మొదలిడిరి. ఆంధ్రనాటక పితామహుఁడగు బళ్ళారి కృష్ణమాచార్యకృత మగు చిత్రనళీయము, శ్రీహర్షుని 'నైషధము' భారత నలోపాఖ్యానముల నాధారము చేసికొని బయలు వెడలినది. నాటకరచనమునకు కావలసినవి నవరసములు (శృంగారహాస్యకరుణా రౌద్రవీరభయానకాః బీభత్సాద్భుతశాంత రసాః) వీనికి స్థాయీభావములు (రతి ర్హాసశ్చ శోకశ్చ, క్రోధోత్సాహౌ భయం తథా, జుగుప్సావిస్మయశ్చ, శమోపిచ) (సాత్త్వికవ్యభిచారి) భావములు, హావ, భావ, విలాసాది చేష్టలు వీనిని గమనించి దశరూపకములు నాటకము, ప్రకరణము, భాణము, ప్రహసనము, డిమము, వ్యాయోగము, సమవాకారము, వీధి, అంకము, ఈహామృగములు, తద్భేదములు తెలిసి, నాటకలక్షణములగు నాయికానాయక విభేదములు, బిందుపతాకాదులు నెఱిఁగి వ్రాయఁబడిన నాటకములు తెలుఁగున చాల తక్కువ. పండితకవుల రచనలను కొద్దిమాత్రములు విడిచి, రైల్వేకవుల పాత్రములు దేశక్షేమము నొల్లక కత్తిగట్టి రచించినవని చెప్పవచ్చును. ఇది (శాస్త్రపద్ధతి రచనము) చాలకాలము ప్రజామోదము వడసినది. తరువాత ఆంధ్రీకరణములు బయలుదేరినవి. వసురాయల వేణీసంహారము, శాకుంతలము, విక్రమోర్వశీయము మున్నగునవి, వేం

కటరాయశాస్త్రిగారి ఆంధ్రీకరణములు, వీరేశలింగముగారివి తలసూపినవి. ఇవియును ఆరోజులలో ప్రజలు మెచ్చిరి. ఆపై చిలకమర్తివారి ప్రసన్నయాదవము, గయోపాఖ్యానము బయలేగినవి. వీరి హాస్యోక్తులును, సులభశైలియును నిశాని దార్లగు బండితోలువాళ్ళకును, చదువరులకును నానేకవిధముగ కంఠస్థము లైనవి.

అంత విద్వత్కవులగు తిరుపతివేంకటేశ్వరకవుల భారత నాటకములు తలలెత్తినవి. మొదల నివి నాలుగై యిటీవల ఐదైనవి. అవి పాండవజననము, ప్రవాసము, ఉద్యోగము, విజయము, అశ్వమేధ మనునవి.

"శివుడుం దాండవమాడ నాడవె పిశాచీ భూతసంతాన ముల్'' అనునటులు వీనిఁబట్టి లెక్కకులేని జననములు ప్రవాసములు పుట్టినవి.

బళ్ళారి కృష్ణమాచారిగారి ప్రోత్సాహమున నుద్భవించిన నాటక సమాజమునుబట్టి యీసరికి చాల సమాజములు (థియేటర్లు, కంపెనీలు) లేచినవి. అందు మానేపల్లివారిది పేరువడసిన దై చిలకమర్తివారివి బాగుగ ప్రదర్శించెడిది. ఈనాటక ప్రదర్శనము కాళిదాసునాఁడును ప్రచారములో నున్నట్లు పెక్కు నిదర్శనము లున్నవి. షేక్స్పియరు గూడ మంచినటకుఁడని చాలమంది యిప్పుడు తెలిసికొనినదే. భరత శాస్త్ర రచనమునుబట్టియే నాటకప్రదర్శనముల యాచార

మాహాత్మ్యము. దశరూపకములలో నృత్తనృత్యతాలలయాన్విత ప్రక్రియలఁగూర్చి చెప్పఁబడినవి. వీనిఁబట్టి నాటకప్రదర్శన ప్రాచీనత స్పష్టము. సంగీతములకు పూర్వము గౌరవముండెడిది కాని, నాటకములలో వేషములు ధరించుట యనిననైచ్యముగ భావింపఁ బడుచుండెను. అందులకు కారణము, చాలకాలము నుండి యీప్రదర్శనములు, దాసరిభాగవతుల వృత్తిగను, బ్రాహ్మణులలో కూచిపూడివారి (భాగవతుల) వృత్తిగను నిర్వహింపఁ బడుచుండెను. భామకలాపము మున్నగు వేదాంత రహస్యములు గల నాటకములు సహితము భోగకాంతలవంతునఁ జేరెను. భరత శాస్త్రానుసారమగు నభినయకౌశలము, సంగీతసమ్మేళనము గలవారగుటచే వారిపాలయ్యెను గాఁబోలు! విద్య కొంచెము తక్కువైనవారు (దాసరిభాగవతులు) వీధినాటకములు ప్రదర్శించుచుండిరి. మఱియు కొలదివారు ప్రదర్శింప జాలకయో అత్యంతప్రాచీనత (Reminiscence of Primitive or original custom) ననుసరించియో, తోలుబొమ్మల నాటకములను నేఁటికి మిగిల్చియుంచిరి. ఈ ప్రస్తుతమున్న సమాజములకు కూచిపూడివారే ఆదర్శప్రాయులు కాఁగా నివి వానిపైనభివృద్ధులుగా వచ్చును. ఆపైన వర్ణసాంకర్యము గల తక్కువజాతివారలు స్త్రీపురుషులు గలసి కూటము లేర్పడినవి. తత్సమ్మేళన కారణముననను, అన్యవృత్తి లేక తదేకవృత్తులగుట చేతను క్రమముగ దుష్టాచారములకు లోనయి (ఆహారనియ

హూదుల వీలులేక, సాంగత్యదోషములకు లోనగుటచేత, నిద్ర బాసి ఒడ లెఱుంగని యభినయమునకు నవరసమగు మత్తుద్రవ్యములు (గ్రోలుటవలన) నైచ్య మారోపింపఁబడిన దయ్యెను. సురభీకంపెనీలు నించుమించుగ నిట్టివే. భుక్తికి లోపము లేక విద్యాధికులై మంచివృత్తిగలవారిందు చొరక, తల్లోపములు గలవారే జీతములకు కాలక్షేపములకు నిందుదిగుటచే గౌరవ హీనత తప్పనిదగుట. పూర్వమన్ననో రాజాదరమున నాటకొ-కప్పుడు రాజసభలలోనే యొకభాగము వేరుగ నేర్పఱచుచుండిరి. ఇప్పటికి నట్టివి కొందరు రాజుల (జమీందారుల) యాదరమున పూర్వాచారము ననుసరించుచున్నవి. నాటకరచనము కొలఁదిగ నభివృద్ధి జెందునప్పటికి బందరులో జార్జిథియేటరు మున్నగునవి బయలుదేరినవి. ఇప్పటికి అన్యవ్యాపారులు (Amateurs) అని, అనన్యులు (Professionals) అని యొకవిభేదమేర్పడి నాటకకళకు కొంతగౌరవమునకు తావల మేర్పడెను. వీరు పాండవనాటకములు, నేతత్కవిప్రణీతములగు ముద్రారాక్షసము మొదలగునవి వ. సు. రాయలగ్రంథములు (వేణీసంహారము etc.) చిత్రనళీయము, వేదము వేంకటరాయశాస్త్రిగారిచే రచింపఁబడిన ప్రతాపరుద్రీయము, ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణగారి రసపుత్రవిజయము, బలిజేపల్లివారి సత్యహరిశ్చంద్రీయము, వీరేశలింగంగారి శాకుంతలము లోనగు ప్రశస్తివహించిన నాటకములు ప్రదర్శించుచుండిరి. జమీందారులు

నః (మైలవరము) ప్రోత్సాహకర్తలై సమాజములను స్థాపించిరి. ఇట్టి సమాజములు కొంతవఱకనర్థదాయకము లైనను, వీనిం జూచి ఇతర సమాజములైనను బాగుపడు నవకాశము నిచ్చుచున్నవి. పసిపిల్లల ముద్దుచేవారియశ్లీలాసభ్య చర్యలును మన మామోదించునట్లు వీరివెఱ్ఱివెఱ్ఱి యభిరుచులును (చిందులు పాటలు, తాళములును) సభ్యుల కానందదాయకములయ్యెను. జనము విఱుగంబడి వచ్చుటచే వేనవేలు రాంబడి గలిగి 'చెట్టులులేనిచోట ఆముదపు చెట్టు' వలె స్వర్ణపతకములును వచ్చి వీరిపైనఁ నేఁబడుచుండెడివి. కనులు విప్పి తెలిసిన యీనాటికైనను వారి యిప్పటి దుస్సాంగత్యములకు తావలములయిన యాసమాజములు నిందాపాత్రములని గ్రహింపకమానరు. నాటకవేషధారులనిన పోకిరీలనియు చెడిపోయినవారనియు పల్లెటూళ్ళను నితరచోట్లను పెద్దలు నిరసించుట వీనింబట్టి యచ్చెరువుకాదు. భావప్రకటనము లేదు. బల్లత్రొక్కుట, రాగము విసరుట, చిందులసందడి, అందమని యెంచుట ప్రబలెను. వేషమునకు తెరలకు ప్రాముఖ్యమయ్యెను. అర్థజ్ఞానశూన్యత, అపస్వరముల యధికత, నెవరును దిద్ద సాహసింపరైరి. కాని బందరు మున్నగుచోట్ల చదువుకొనినవారు గల సమాజములు ప్రతిష్ఠింపంబడుట శుభసూచకమయ్యెను. నటకులకు పోటీలు బయలుదేరి యారీతిని నాట్యకౌశలమభివృద్ధియగు వీలుగలిగెను. పండితులు పరిశోధకులైరి. కాని సంగీతసాహిత్యముల

రెంటను ప్రజ్ఞగలవారు లభించిననే యిట్టిది సఫలమగును. ఇఁక రాజమహేంద్రవరమున చింతామణి సమాజము ప్రసిద్ధినొందెను. మంచిపాడగలవారు కొందరం దుండిరి. వెఱ్ఱి యొకటి ప్రపంచమున మనోవేగ శరవేగములమించును. ఊహూగ ప్రతివర్ణమునకు సమాజములు వెలువడినవి. కవులును (Supply and demand Rates ననుసరించి) అవసరమునుబట్టి యసంఖ్యాకులైరి. కొన్నికొన్ని సమాజములకు ప్రత్యేక (Special and copyright authors) కవులుండిరి. వారికితోచిన సంగీతసారంగధరలు, విషాదసారంగధరలు, అభినవసారంగధరలు వెదజల్లిరి. ఆవిత్తులునాటిన ఆదిపురుషు లెవరో, యేముహూర్తబలమో కాని, శాఖోపశాఖలై సత్కవిప్రణీతమగు ప్రతిరూపకమునకు ఆపేరులనే, అభినవ, విషాద సంగీతములను తోలితోకలతో అంతులేనిబమ్మచెముడువలె అలముకొనుచున్నవి. ఇవియే ప్రయోగికుల చెవులఁ బద్దలుగొట్టి దిక్కులుపిక్కటిలఁ జేయుచున్నవి. ఇట్టి మహామహులకు చారిత్రరూపమున స్థానమిచ్చుటకు వెఱచి ఇంతటితో నాపుదము.

విద్వత్కవులగు తిరుపతి వేంకటేశ్వరకవుల నాటకములు ప్రచురణలోనికి వచ్చినవి. బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారి హరిశ్చంద్ర వెలువడి సర్వజనాదరణీయ మయ్యెను. అడవి వెన్నెలవలె కొప్పివ్వాడి రామకవిగారి రామనాటకము, మోహినిమున్నగునవి ప్రాచుర్యమునొందకయే మాటుమ

డఁగినవి. చిత్రనళీయ మీసరికి పాతఁ గిల్లినది. ప్రజలదృక్పథము క్రొత్తనాటకములవైపు మఱలినది. కాళ్ళకూరి నారాయణ రావుగారి 'చింతామణి' వీరిమన్నన వడసినది. అది కేవల సాంఘికకథ. వారాంగనాలౌల్యము, రాధసౌశీల్యము, తత్ఫలము చక్కఁగ వర్ణింపఁబడినవి. బస్తీలలో ప్రతియింటి వెల్ల గోడలపైనను 'చింతామణి' కాగితములే యయ్యెను. ఆశక మంతరింపకమునుపే తత్కవిప్రణీతములగు పద్మవ్యూహము, వరవిక్రియము వెలుతురుఁజూచినవి. 'సింగరాజు లింగరాజు'ను స్మరింపని వీథులే లేవు ఒకవెలుగు వెలిగి లింగరాజు విశ్రాంతి కేగెను. కీ॥ శే॥ ముత్తరాజు సుబ్బారావుగారు, పోతుకూచి సుబ్బయ్యగారు రచించిన శ్రీకృష్ణతులాభారములు రంగము నలంకరించుచు వచ్చినవి. ఇందు రెండవది విస్మృతిపాత్రము.

భావకవిత్వముతోఁబాటు భావప్రకటనమును నటకుల మానసముల తలసూపినది. పానుగంటి లక్ష్మీనృసింహారావు గారు ప్రచండచాణక్యము మున్నగు గద్యపద్యాత్మకములు రచించి కేవల గద్యాత్మకములగు కంఠాభరణము మొదలగు కొన్నిటిని రచించిరి. నాటకభారతి క్రొత్తదారి ద్రొక్కినది. చరిత్రలు, దేశాభ్యుదయములు మున్నగువానిపై దృష్టి మరల్చినది. పురాణేతిహాసపురుషులగు ధీరోదాత్తనాయకులు తదీయ శృంగారప్రధానరసపోషితములు విసిగించినవేమో కాని 'రోషనార' (శివాజీచరిత్రము) రాణాప్రతాపసింగు,

రామరాజు దర్శనీయములైనవి. వీరరౌద్రరసముల యాకర్షణా
ము హెచ్చెను. గురజాడ అప్పారావుగారి 'కన్యాశుల్కము',
విద్వత్కవుల ప్రతిభాముద్రితమైన 'ముద్రారాక్షసము' కొంతవ
అకాదరణపాత్రములైనవి. ప్రతాపరుద్రీయమున యుగంధరుని
పిచ్చిమచ్చిక మైనది. చాకలిపేరయ్యపేరు ప్రసరించినది. తిరు
పతి వేంకటేశ్వరకవులు రచించిన (భాషాంతరీకృతములు)
అనర్ఘనారదము, దంభవామనము మృచ్ఛకటికము నేలనో
యీనటకులదృష్టిఁ బడవయ్యెను. ఒకప్పుడైనను ముందు
పాండవవిజయోద్యోగములవంటి ప్రాముఖ్యము వీనికి రాఁగల
దాయనుట విచార్యము. సరే, అనామకులనామరహితములు,
నాటకనామమాత్రములు, బజారులయందు, రైళ్ళయందు
గలవు. వానికితావులేదు. ఆవిషయ మక్కరలేదు.

కవుల యాదేశములలో నూతనపరిణామము ననుస
రించి ఏకాంకనాటకములు బయలుదేఱినవి. 'మేవాడుపత
నము' కూడ నాటకరంగము జూచినది. (జేబున్నిసా, అనా
ర్కాళి, నర్తనశాల యిట్టి వేలనో గ్రంథస్థములుగనే యున్నవి.)
సుప్రసిద్ధనటకులు నెల్లూరి నగరాజారావుగారు, బళ్లారి రాఘ
వాచార్యులు మొదలగు ప్రములు భావప్రకటనమునకు వచన
రచనమే సహకారియు, రసవత్తరమునని నిరూపించిరి. పాట
కులు నటకులు నగు డి. వి. సుబ్బారావుగా రేలనో పద్యముల
నిరసింపక వారల కెనయగు చాకచక్యమునే చూపఁ గలిరి.

(Grapes are Sour అననిట్టివా? యని కొందరిసంశయము) మఱియొకముఖ్యవిషయము మృదంగతాళములతో నాట్యము సల్పియు వాని వదలి రాగమును క్లుప్తపఱచిన లోపము గనుపట్టనీయక ముసలిడాడల వెలితి నటుంచి సినీమాలఁజొచ్చిన సూర్యనారాయణగారు ప్రజాదృక్పథమున కానుగుణ్య మగు వచనగ్రంథముల ప్రదర్శనమునుగూడ నిర్వహింపఁ బూనిన బళ్ళారివారు, ముంజులూరి, గోవిందరాజుల, స్థానంవారును పేర్కొనఁదగినవారే.

కాలముమారెప్పటిదో కాని, అసభ్యములని నాటక లక్షణముల నుండి తొలఁగించి ప్రదర్శనీయములుకావని నిషేధింపఁబడినవెన్నియో [భోజనము, త్రాగుడు, ఊరేగింపు, భజన, కత్తులుకటారులతో, సాము] రంగమునఁ జూపఁబడుట. అత్యద్భుతముగ పరిగణింపఁబడుచున్నది. తబలాత్రమోత నాణెముగ నెన్నబడు చున్నది. ఇట్టి ప్రదర్శనములు నాటకముల పైనదుపాయములగు సినీమాలలో (To avoid waste of energy, to Present realistic and naturalistic Pictures) జూచిన సంతుష్టిచేనైన నాటకములలో చూపకుందురుగాక.

స్టాంఘికములు, మతవిషయికములు (బైబిలు నాటకమని యిటీవలనే వినుభాగ్యమబ్బినది.) రాజకీయములు నైతికములు మున్నగు క్రొత్తనాటకములు బయలుదేరు చున్నవి. సత్కవులు [విద్వత్కవులగు వారు] ఇందులకు పూనుకొనినచో

వందనీయులు. ఇంతవరకు భిన్నసంస్థలు పెక్కులేర్పడినవి. వీరి నాటకములు (Representative Stories) కొన్ని ఆరోగ్యవార ముల నాటకములు (Health week) నంకురించుటచే నిట్టి సందేహము, వృధాయనరాదు. ఇందు, ఈఁగలు దోమలునాయకోప నాయకులు. ఇక, బేట్లు బంతులు, సీసాలు వలలుమహానాయకులు కావచ్చును. Theosoph'cal, Arya Samaj, masonic, Scientific, Athletic నాటకములు వెడలకుండుట ఆలోచనీయముగ నున్నది.

దశరూపకములలో నొకటియగు 'భాణ'ము ననుసరించినవగు బొబ్బిలికథ బాలనాగమ్మకథ యిట్టివి. చరిత్రల సంబంధములు గలవియు వీరరౌద్రములు పౌరుషములు పరాక్రమములువర్ణించుటచే] రసపుష్టములు, దేశభక్త్యుత్సాహ పూరితములును, నయిననుపండితపామరుల కందరకు నందుబాటు గావని నాటక కావ్యరూపములు విడిచి ప్రజాబాహుళ్యము తెలిసికొనుట కనువగుభాషలో, పూర్వరాజుల వృత్తములు కనులకు కట్టినట్లు ప్రదర్శించుటకును వీలుగ రచింపఁబడినవి. నాగరక రచనలు పెచ్చుపెరుగుటచే నవి క్రమముగ నిరసింపఁబడుచు, అడుగంటు చున్నవి.

అరిష్ట స్వరూపములగు రైల్వేనాటకములకన్న నాగరికతలేని కాలమున వెలువడిన యీరూపకము లెన్నిమడుంగులో ప్రశస్తిగలవి, రసవంతములైనవి. ఆహ్లాదకరము లైనవి.

ఈ నాటికి నాటకముల రచనవిషయమై నిలిచిన యభి

ప్రాయము సంగీతము స్వాభావికమునకు విరుద్ధము గనుక అక్కరలేదనియు, అందుచే పద్యరహితములుగా నుండవలయు ననియు నొకటి ముఖ్యము. స్త్రీపురుష సమ్మేళనములగు ప్రదర్శనముల ప్రయోజనము నేటి సమస్యలలో మఱొకటి. దాని మంచిచెడ్డలు కాలమే విమర్శించి చెప్పఁగలదు. నటకుల, తత్కౌశల వర్ణనములను గూర్చి పురాణం సూరిశాస్త్రిగారు రచించిన (నేనందుతో నేకీభవింపక పెక్కువిషయముల యాథార్థ్యమున భిన్నాభిప్రాయుఁడనే అయినను నామమాత్రముగ సూచించితిని) నాట్యాంబుజ మొండుగలదు. అందునటకుల విషయమే కలదు. నాటకముల విషయము లేదు. అందును కొన్నికొన్ని యభిమాన పూర్వకములైన విషయములై యున్నవి.

దినదినాభివృద్ధిని భావప్రకటనముకొఱకు నావేశపరులైనతఱి మాటాడలేక అభినయము సాధ్యపడక సినీమానాట్యమవలంబించుటయు పిదప ప్రతిమల ననుకరించుటయు భావిప్రదర్శనాంశములని యొకకవి సూచించెను. అట్టి యదృష్టమబ్బకుండునుగాక. కవివర్యులు యోగ్యములగు రచనలకు పూనిక వహింతురుగాక.

ప్రాచ్యబిరుదములకు పరీక్షలిచ్చితిమిగదాయని కాని, పెద్ద జీతములుగలవారమనిగాని, బి.ఏలమనికాని, తీఱికగలదని కాని జాతికులసంఘాభిమాన మున్నదిగదాయనికాని లేదా ప్రకటించు పత్రికలున్నవనికాని,కసరతుచేసి తయారైన కవులు చెలరేఁగకుందురుగాక. వివేచనాదక్షులుకానివీధిజనమేప్రేక్షకులై వస్తునిర్ణాయకులు గాకుందురుగాక.

# నాటక లక్షణములు Etc.,

1. నాటకము-ప్రఖ్యాతవృత్తము, శృంగారరవీరసములలో నొక దానికి ప్రాధాన్యము. అన్యర సముల కనుప్రవేశము.

2. ప్రకరణము-ఉత్పాద్యవృత్తము, ధీరశాంత నాయకుఁడు శృంగార రసప్రాధాన్యము.

3. భాణము-ఉత్పాద్యవృత్తము, ధూర్తవిటనాయకుఁడు శృంగార వీరరసములు సూచనమాత్రసారములు.

4. ప్రహసనము-కల్ప్యము, (వృత్తము), పాషండ ప్రభృతులు నాయకులు హాస్యరసము.

5. డిమము-ప్రఖ్యాతము (,,) దేవగంధర్వ పిశాచాది ధీరోద్ధతనాయకులు (16) రౌద్ర రసప్రాధాన్యము, శృంగార వీరాను ప్రవేశము.

6. వ్యాయోగము- (,,) ధీరోద్ధతనాయకులు—వీరరస ప్రధానము.

సమవాకారము-కల్పితము కాని ప్రసిద్ధము కాని దేవాసురాదినాయకులు (12) వీరరసప్రధానము.

8. వీధి— కల్పితము ,, ధీరోద్ధతనాయకులు-శృంగార రససూచనామాత్రసారత.

9. అంకము— పరిఖ్యాతము ,, ప్రాకృత జనులు నాయకులు కరుణరసప్రధానము.

10. ఈహామృగము - మిశ్రవృత్తము, ధీరోదాత్తనాయకులు శృంగారరసాభాసత్వము.

ప్రఖ్యాతవృత్తము- ప్రసిద్ధమైనది. ఉత్పాద్యము- కల్పితము. మిశ్రము-రెండుకలసినది.

నవరసములు— శృంగార, హాస్య, కరుణ, రౌద్ర, వీర, భయానక, భీభత్స, అద్భుత, శాంతములు.

11. వీనికిస్థాయీభావములు:- రతి, హాస, శోక, క్రోధ, కోప, రోష, ఉత్సాహ, భయ, జుగుప్సా, విస్మయ, శమములు.

విభావానుభావసాత్త్వికవ్యభిచారిసామగ్రీ సముల్లాసితస్థాయీభావము రసము. ఇది అంకురితత్వ, కుసుమితత్వ, పల్లవితత్వ, ఫలితత్వహేతువుగ నభివృద్ధి నొందును.

విభావములు- (2) ఆలంబన, ఉద్దీపన

అనుభావములు- కటాక్షాది శరీరజములు.

సాత్త్వికభావములు-(8) స్తంభ, ప్రళయ, రోమాంచ, స్వేద, వైవర్ణ్య వేపథు, అశ్రు, వైస్వర్యములు.

వ్యభిచారిభావములు - నిర్వేదము, గ్లాని, శంక, అసూయ, మద, శ్రమ, ఆలస్య, దైన్య, చింత, మోహ, స్మృతి, ధృతి, వ్రీడ, చపలత, హర్ష, ఆవేగ, జడత, గర్వ, విషాద, ఔత్సుక్య, నిద్ర, అపస్మార, సుప్తి, విబోధ, అమర్ష, అవహిత్థ, ఉగ్రత, మతి, వ్యాధి ఉన్మాద, మరణ, త్రాస, వితర్కములు.

భావమునకు- శాంతి, ఉదయ, సంధి, శబలత-యనికలవు.

శృంగారచేష్టలు- భావ, హావ, హేల, మాధుర్య, ధైర్య, లీల, విలాస, విచ్ఛిత్తి, విభ్రమ, కిలికించిత, మోట్టాయిత, కుట్టమిత, బిబ్బోక, లలిత, కుతూహల, చకిత. విహృత, హసితములు.

అవస్థలు- చక్షుః ప్రీతి, మనస్సంగ, సంకల్ప, ప్రలాప, జాగర, కార్శ్య, అరతి, లజ్జాత్యాగ, జ్వర, మూర్ఛలు,

నాయకులగుణములు- మహాకులీనత, ఔజ్జ్వల్యము, మహాభాగ్యము, ఉదాత్తత, తేజస్వితా, విదగ్ధత్వము, ధార్మికత్వము, మహామహిమత్వము, పాండిత్యము, స్వరూపము

స్వరూపము- యశః ప్రతాపముల సుభగత్వము, ధర్మకా మార్థతత్పరత్వము, ధురీణత గుణాఢ్య త్వము,

భేదములు(విశేషములు)-ధీరోదాత్త, ధీరోద్ధత, ధీరలలిత, ధీర శాంతులు,

శృంగారనాయకులు- అనుకూల, దక్షిణ, ధృష్ట, శఠులు,

వీరికినాయికానుకూలమందు- కొంచెము ఊనస్వభావముగల పీఠమర్ద, ఏకవిద్యుడగు విట,సంధానకుశలుం డగుచేట, హాస్యప్రియుఁడగు విదూషక అనువారు,

శృంగారనాయికలు- స్వాధీనపతిక, వాసకసజ్జిక, విరహోత్కం ఠిత. విప్రలబ్ధ, ఖండిత, కలహాంతరిత, ప్రోషితభర్తృక, అభిసారిక.

వీరిలో- పద్మినీ, చిత్రినీ, హస్తిని, శంకిణీ మున్నగు లక్షణభే దములును, ముగ్ధ, మధ్యమ, ప్రౌఢ, మున్నగు వయోభావ భేదములు గలవు.

వీరికి (నాయికలకు)- నాయకానుకూలమందు దాసీ, సఖీ, కారూ (రజకీమున్నగు), ధాత్రేయి (ఉప మాతృసుత), ప్రతివేశినీ (సమీపగృహ వర్తినీ), లింగినీ (పరివ్రాజిక) శిల్పినీ, స్వా (స్వయం, భగినీస్యాలికమాతులసుత)-అను

వారు. ఇట్టి దృశ్యప్రబంధములకు సామా
న్యముగా వలయు నుపకరణములు.

1. వివక్షితార్థ ప్రతిపాదనము
2. గోప్యార్థ గోపనము.
3. ప్రకాశార్థ ప్రకాశనము
4 అభినయ రాగసమృద్ధి
5. చమత్కారిత్వము.
6. ఇతివృత్తి విస్తరణ. 1 సూచ్యము } అనిద్వివిధము.
2 అసూచ్యము

దృశ్యము. శ్రవ్యము.

నాటకమున కాది—సూత్రధారుని ప్రవేశానంతరము, గృహిణీ నటీ మారిష పారిపార్శ్వక నర్మసచివ విదూషకుల ప్రస్తావనతో ముగియును.

ప్రస్తావన (ప్రరోచన)-ప్రస్తావనము ప్రవర్తక ప్రయోగాతిశయము.

ఇది గూఢార్థపద పర్యాయమాల, ప్రశ్నోత్తర రూపమునను అన్యకారణమిషచేతదన్యకార్యకరణ్యము అన్యకార్యప్రసంగమున ప్రకృతకార్యసిద్ధియు గలదు.

ఇందలి భాగముల పరిభాష పూర్వరంగము Prologue or prelude of a drama (రూపకము ననుసరించి కథాసామగ్రి. ననుసరించి అంకములుండును.)

అందుమధ్యవచ్చునవి:—

విష్కంభము:- మధ్యపాత్రలచే జరుగుచున్న కథావిషయములు సంక్షేపము గాఁజెప్పఁబడును. ఇది శుద్ధము సంకీర్ణము ప్రకృతిప్రాయము మిశ్రమమైనది.

అంకాస్యము:— అంకాంతపాత్రలచే ఉత్తరాంకార్థ సూచన కలది.

ప్రవేశము- ఆద్యంకమునగాక పాత్రప్రయోజితముగ పూర్వాంకాంతపాత్రలచే ఉత్తరాంకార్థము సూచింపఁబడునది.

అంకావతరణము- పూర్వాంకార్థము ననుసంగతమై ఉత్తరాంకార్థమునఁ గలది. సూచింపఁ బడ్డని అంకపాత్రముగలది, అంకావతరణము.

అంకము- ప్రత్యక్షనేతృచరితముగలది, బిందువ్యాప్తిపురస్కృతమైనది, నానార్థ ప్రకారార్థ సంవిధానరసాశ్రయమైనది.

ఆముఖము- సూత్రధారుఁడు పైఁజెప్పబడిన నటి మారిపాదులతో స్వకార్య ప్రస్తుతాక్షేపములైన చిత్రోక్తులతో ప్రసంగించునది.

ప్రస్తావన- ఇందలి కథోద్ఘాతమున స్వవృత్త సమవాక్యార్థములందిగొని పాత్ర ప్రవేశమగున ట్లుండ వలెను.

నాంది- 8, 12, 18, 22, అక్షరములు కలిగి అర్థమునఁగాని
శబ్దములఁగాని కావ్యార్థసూచనముకలది. మంగళార్థ
పదోజ్జ్వలమై ఆసీర్నమస్క్రియా వస్తునిర్దేశరూపము
కలది.

సంహ్నతి- కార్యార్థోప సంహారము.

మంగళం- శుభశంసనము ప్రశస్తి కలది.

మఱియు నాటకములకు ఇంగ్లీషునవలెనే ఐదుభాగ
ములు కలవు. వీనికి పంచసంధు లనిపేరు.

1. ముఖము- Entrance, opening (Exposition.)

2. ప్రతిముఖము-Secondary plot, or incident to tend to hasten or retard the catastrophe (Expansion)

3. గర్భము-Interior (climax)

4. విమర్శన-Deliberation, Conflicting judgment, the impression left on the mind by the past good or bad actions (Expostulation, reflection or revelation.)

5. నిర్వాహణము-The last stage in which the action or the play is brought to a head. Denoument (catastrophe.) ఇట్టి వైదు ఉపకరణములు కలవు.

1. బీజము-The seed or germ of the plot of a play, story etcc

2. బిందు -The sudden development of a secondary plo (incident) which like a drop of oil in water

quickly diffuses itself; and thus supplies important elements in the development of the plot. It is the source of an intermediate object while the 'Bija' is that of the Principal one.

3. పతాక-An Episode Intimation of an episodical incident when instead of the thing thought of or expected, an other of the same character is brought in by som unexpected circumstance.

4. ప్రకరి-An interlude or Episode insreted in a drama to explain what is to follow.

5. కార్యం-The denoument (culmination) of a drama.

మఱియు నింక నైదుభాగములకు వలయు 64 విశేషాంశములు గలవు. కాని ప్రకృతమున నవి దురపగాహాము లగుట గ్రంథవిస్తరభీతి వదలితిని.



# సంగీతము - సాహిత్యము



“ సంగీతస్య హి సర్వజేత మనసే మాధ్వీకమృద్వీకయోః ”

ఒక విషయమును తోలుతనే నిర్వచించుట సులభ
సాధ్యముకాదు. అట్లు యత్నించుటయు వివేకసమ్మతము
కాదు. లక్షణలక్ష్యము లుదాహరించి, ప్రాచీనాంగిక విషయ
ము లుపలక్షించి, యౌగికరూఢార్థము లు సమన్వయించి శబ్ద
నిష్పత్తిరూపించి భేదసాదృశ్యములు వివరించి సమీకరించిన
కొంత నిర్వచనప్రయోజన ముండఁగలదు ; కాని సూత్రప్రాయ
ముగ తేల్చుట నరివడనిది. గురోర్భావం గౌరవం, నటస్య
భావం నాట్యం అని చెప్పుపెద్దలకు జానిభావమెంత సమర్థోభయ
మో వినువారికి నంతే యగును. సాంకర్యమున కర్థము చెప్పుచు
సమ్యక్ కరోతీతి సంకరః తస్యభావం సాంకర్యమని యొకపండి
తునినోట విని నేను విస్మబోతిని. అట్లే సంగీతమునకు సమ్య
గ్గీయతే యనుట సులభవాదము. ఈ ‘బాగుగా పాడుటకు
మితియేది? గతియేది? దాసరి భాగవతులు పదిమందిచేరి గోల
చేయుచు బాగుగ పాడుచున్నట్లు తలఁపనిచో వారాపాట
కెట్లుద్యమింతురు ? భోజనసమయములలో దినువారి యాకు
లలో అడుగులదుమ్ము రాలునట్టియైన వెఱువక, వడ్డనల కడ్డ
మనట్టియైన మానక ఇద్దరుముగ్గురు కలసి పండ్లూడిన చప్పిదా
డలతో, అరచిన పాడావిడిచే బొంగురువోయిన గొంతుకలతో

పరుగులెత్తిన యలసటచే కారుచు వంక్తి వారినిముంచి యెత్తు చెమటవానతో, తరంగములు పాడుటయెందులకు ? ఇది సంగీత మగునా కాదా ? మఱి దీని నిర్వచనమెట్లు ?

పోనిండు సాహిత్యముమాట. సహితస్యభావం. సహితస్యధర్మః, సహితస్యసంబంధీ. ఇందేదైనను సుబోధకమై మన మనుదినము వాడుకొను నర్థమున కిమిడియున్నదా ? కొందరు బుద్ధిమంతులు వీనికి అన్యపదములు కొన్నిచేర్చి యేదో చెప్పుదురు. కనుక మనప్రకృతాంశము కేవలమా శబ్దమునకున్న దానిని నిష్పన్నముచేయుట చాలదనియే. భాష్యకారుఁడు చెప్పినట్లు లొక్కొక్కప్పుడు దాని యాకృతి, గుణములు మున్నగునవెన్నో తెలియఁజెప్పవలయును. తర్కశాస్త్రమున నిది విధింపఁబడినది. నిర్వచించుటకు గల పద్ధతులు పెక్కులున్నవి. ఒకవిషయమును గూర్చి చెప్పుచో తద్ధర్మములు, తద్భేదసాదృశ్యములు తత్కార్యకారణములు తదాభాసములు కూడ ప్రాసంగికముగా ప్రయోజనకారులగును. అందుచే పైవ్యాసవిషయములకు నిర్వచనయత్నము తలపెట్టక కొంతవడి వానిని చర్చించుటయే యవసరము.

సంగీతసాహిత్యములనుట మనమెప్పుడు వినుచున్నదే. 'కూనరాగము తీయలేని మగవాడు కుడుములు వండలేనియాడుది యుండరని వాడుక. రెండవది యీరోజులలో కల్లయే కాని సామెత సలక్షణమగుటకు 'కూనరాగము తీయలేనివారు

తుంటికవిత్వము చెప్పలేనివారు' ననుట ప్రమాణపక్షము. ఈ రెండును నేడందరి సొత్తయినవి. ఈ వఱకు 'గాంధర్వంచ కవిత్వంచ...అభ్యాసేన న లభ్యంతే...సహజాగుణాః' యని చెప్పుచువచ్చిరి. ఇప్పుడది మాఱుటకు తగిన హేతువులు లేక పోలేదు. పూర్వము పెద్దలయెడ గౌరవము, పెట్టిపుట్టినవారు కొందరుందురను నమ్మిక, ఆత్మవిచారము, తనకు నితరులకు గల తారతమ్యచింతనము, సిగ్గుబిడియములు గలిగియుండిరి. అధునాతనమున ఎవరికివారే కవిబ్రహ్మలు, తిలకలు, గాయక శిఖామణులు, అవతంసులు. మఱియొకభేదము, నాడు సంగీత మనునది యొకేవస్తువు. 'స్వరరాగసుధా' యని 'సంగీతశాస్త్ర జ్ఞాన' మని, 'సంగీతమే సారూప్యము, సాయుజ్యము'నని 'శిశు ర్వేత్తి పశుర్వేత్తి వేత్తిగానరసం ఫణిః' అని యెద్దానిసారము గలదో యదియే సంగీతమను వెఱ్ఱినమ్మకముండెడిది. ఇప్పుడో వివిధశాఖల విస్తరిల్లినది. ఒకప్పుడు పెద్దతరగతి విద్యార్థిని భాగవతమును గూర్చి ప్రశ్నింపఁగా వచ్చిన సమాధానము— మహాభాగవతము, దాసరి భాగవతము, కూచిపూడి భాగవ తము నందలి విభాగములని. కోతులభాగవతమో యని తిరిగి వంతులడుగవలసి వచ్చెను. అట్లే భారతము, ఆంధ్రమహా భారతము చేటభారతము. ప్రకృతము సంగీతములో—

శాస్త్ర (కట్టు) సంగీతము, కంపెనీస్టైయిల్ (నాటక కత్తు) సంగీతము, గ్రామఫోనుసంగీతము, పురాణసంగీతము,

తెలుఁగు వంతుల్ల వాచకసంగీతము ముఖ్యమైనది పెండ్లిసంగీతము. ఇంకొకటి కూడ కలదు. ఇమిటేషన్ (అనుకరణ) సంగీతము అదే గవాయిసంగీతము (గాండ్ గోండ్ మాండ్ గాసు, మాల్గాసు మొదలైనవి). మఱొకటి చర్చిప్రార్థనలలో క్రైస్తవులుతీయు బైబిలుపాట రాగములు. ఇవిచాల శాఖలగుటచే పరిశోధించి నాకుతోఁచినరీతి నీవిధముగ విభాగింప మేలని తోఁచినది.

సంగీతమునకు రాగములు ప్రధానములు గనుక అందు 'విరాగములు సరాగములు పరాగములు' అని తేలికపఱచితిమి. ఇందు న్యాయసమ్మతముగ శాస్త్రసంగీతము సరాగము కావలెను. కాని చాలవఱకది సంపూర్ణ విరాగముగనే సాగుచున్నది. అర్థరీతిని పెండ్లిసంగీతము సరాగము కావలెను. ధోరణిని, ప్రత్యేక ప్రమాణమునుఁబట్టి, తెలుగుపండితులగు వారిది సరాగమే; కాని పెండ్లి చదువు కాక మిగిలినవన్నియు చాలవఱకు విరాగములే యగుచున్నవి. ఇందులో చేర్పఁదగినది, శాస్త్రమునకు పాడుచున్నవాని కంఠమునకు సంబంధములేక అరమైలు దూరముగనుండి ఒకేతూఱి పదివంద్రెండు మొట్టులనొక్కి గోలచేయు హార్మోనియము సంగీతము నిట్టిదే. అందది కొంచెము ప్రాతగిల్లిన పనిముట్టయినచో దానిరణగుణ ధ్వనికి, గాలిరొత్తిడికి, రాజమహేంద్రవరమువంటి యూళ్ళలో రెండుబండ్ల పరాగము వెలువరింపఁగలదు. ఇటీవల

కొన్నికొన్ని బడులలో ఎగ్జిబిషన్ (ప్రదర్శనార్థము) సంగీతము
కటిబయలు చేరినది. దాని యుద్దేశము ఆత్మరంజనముకాని
జనరంజనముకాని జ్ఞానసంపాదనముకాని కాదు. కేవలము పది
మందికిచూపుటయో చూచుకొనుటయో (అడ్వర్టైజ్మెంట్
మాత్రమే). ఐనప్పటికి దీనినిగూడ శ్లాఘించువారు వేలకు
వేలున్నారు. నిజమునకు వీనికే తగిన పొగడ్త యున్నది.
జట్కాబండ్ల జనమునకు, వీధిజనమునకు, కిళ్లీసోడా జనమునకు
లాండ్రీసెలూనుల జనమునకు, 4, 5 ఫారములనుండి ఇంటర్మీడి
యేట్ పరీక్షవఱకుండు విద్యార్థి జనమునకు, క్రొత్తక్రొత్తగ
నాగరకత నలవర్చుకొనవలె ననుకొను యువయువతీజనమునకు
పై చెప్పబడినయీ గ్రామఫోను, కంపెనీ, ఇమిటేషను సంగీత
ములే సదానందచిదానందములను కొంచెముదాటిన పరమా
నందము లగుచున్నవి.

ఇప్పుడు మన మాలోచింపవలసిన విషయము వీనిలో
గల విశేషమేమి? ఈ సంగీతమునఁగల భావమా? అర్థమా?
ఇంకేది వీరి హృదయముల నాకర్షించుచున్నది; అనునదే.

సరి, సాహిత్యమునకు వత్తము. ఇదియు పూర్వమంత
ఛిన్నభిన్నములుగ లేదు ఒకచోట నొకపండితశబ్దవ్యవహ్రాతుఁడు
బహిరంగసభలో సాహిత్యమునుగూర్చి వచించుచు, పంచ
కావ్యములు, పిదప నాటకములు తదుపరి నాటకాంతేసాహి

త్యం అనినారుకనుక రసగంగాధరము, సాహిత్యరత్నా
ప్రకాశిక దీపిక మున్నగు నాలుగైదు సాహిత్యగ్రంథ
గలవనియు, శాస్త్రములు వేఱనియు, ప్రపంచమున
నాలుగే సాహిత్యగ్రంథములనియు ఘంటాప
దెప్పుచు, కనుబొమలుమీటుచు, సాహిత్యములో ని
యామూడునాల్గు గ్రంథములనుండి రెండుమూడు పం
హారణముల నెత్తిచూపఁగా సభ్యులలో నొకరును నవ్వ
నను మెచ్చుకపోయినను తన తెలివికి తానే ము
పోయిన యమ్మహానుభావుని చూచిన మంట, జాలి
ముప్పిరిగొనినవి. మఱచితిని ఆయన నైజధోరణియగు
పంతుళ్ల సంగీతమును సభ్యుల కొంకీవఱకు గగ్గోలుపఱ
నది. అప్పుడే యొక సాతానిగాయకుడో నాయుడుపా
లేచి మఱి మాసంగీతంలో సాహిత్యమోనండీ అని ని
యడిగినట్లును నాకు జ్ఞప్తియున్నది. అందుచే వెనుక స
మన నేదో యొక యర్థమో యపార్థమో యుండెడిది
నేఁడో, ఆంధ్రసాహిత్యము (పరిషత్తు), నవ్యసాహి
అభినవసాహిత్యము, గీర్వాణసాహిత్యమండలి ఇట్టి
ధారణాసంభావనాపూర్వపదకర్మధారయములుకాక ఉ
సాహిత్యార్థమున కొంతకాలమెగసిన 'సాహితి' ముఖ
వేఱొకటి, ఐదుబదులు గుణింతములతో నంతమొ
గాయకనటకగంధర్వవిద్వాంసులగు వారి వర్ణములలో

ములలోని 'సాహిత్యము' (వారి ప్రాణములకదే రసగంగా
ధరము, సాహిత్యరత్నాకరము సర్వాభరణములును)—అను
నిన్నిరీతుల దిగ్వేదండతుండములనుండి అండపిండబ్రహ్మాండ
ములనిండి దండిగ రైలుబండిప్రయాణముల మెండగుచున్నది.
ఇట్లిన్ని తెగలుగ విభాగమగుటకు కారణమరయుఁగా నెట్ట
కేల కొకరీతి తట్టినది. సంస్కృతమున నొక శ్లోకమున్నది.
దాని యర్థము కవితాకన్యాస్వయంవరవిషయము గూర్చినది.
ఆమెకు వ్యాకరణపండితుఁడు తండ్రియట, తార్కికుఁడు
భ్రాత. ఛాందసుఁడు (వేదపండితుఁడు) చండాలసముఁడు
(శ్రోత్రియులు పంచమున కెంతదూరమునుండి తొలఁగుదురో
అట్లే ఆమెయు వాని తొలఁగిపోవునట) ఇఁక సాహిత్యకారు
లను స్వయముగా వచ్చి వరించునట. తత్కన్యాకరగ్రహణము
కొఱకు, ముసలివారే ఆంధ్రసాహిత్యపరిషత్తుగఁజేరి యల్లాడు
చుండ, పడుచువా రూరకుందురాయని మిగిలిన సాహిత్య
ములు వెఱ్ఱితలలెత్తి చూచుచున్నట్లు తోచుచున్నది. ఈకారు
లలో సాహిత్యకారులలో మాసాటికారు అన్యులు కారనియే
కాఁబోలు సాహిత్యశిరోమణులందరు పిలకలు వీకి పెద్దజుట్టులు
పెంచి జడదారులై తపస్సుచేసి హనుమంతులవలె చిందులు
త్రొక్కుట. కన్యావలోకన మెంతభ్రాంతికి తావలమగుచున్నది!
తత్కరగ్రహణాశ యెన్నివికారముల పాల్సేయుచున్నది!

వీనినిఁ జూచి యుబ్బితబ్బిలగు దబ్బరకవులు గలరు. ఎబ్బెబ్బె యని సిబ్బితివడు నిబ్బరవు తెలివికాండ్రు గలరు.

కావున వీనిలోఁ గల విశేషమేమి? ఇందలి భావమా? యర్థమా? అక్షరముల యందమా? ధ్వనియా? ఇందేది తల కెక్కుచున్నది? ఎంతమందికి? ఎట్లు?

సంగీతమును గూర్చియు మనకు కొన్ని జవాబులు చెప్ప వలసిన ప్రశ్నలు వచ్చినవి. సాహిత్యమును గూర్చియు నట్టివే మఱికొన్ని ప్రశ్నలు గల్గినవి. రెంటియందు నేవేని సమాన ధర్మములున్నవా? రెండును నిట్లు ప్రజలనేల తారుమారుచేసి వికారముల పాలొనరించుచున్నవి? ఇందొకదానికి మఱొక దానికి గల సంబంధబాంధవ్యము లెట్టివి? దేనియందేది యెంతవఱకిమిడియున్నది? లేక యీరెండ్వయును మత్తేదే నొకదానినుండి యుద్భవించినవా? వీని పుట్టుపూర్వోత్తర ముల నిప్పుడు పరికింపవలయును.

ఒకఁడొక పద్యమును రాగరహితముగనే చదువును. ఒకఁడొక వాక్యమును చెప్పుచున్నాఁడు. శ్రోతలమనసున సంతోషమో, కోపమో, యనుకంపయో యేదేనొక భావము వొడముచున్నది. అనుకూలమో ప్రతికూలమో ఆవక్త నోటినుండి వెలువడిన పద్య, వాక్యానుసారముగ యథోచితభావము స్ఫురించుచున్నది. అదియటుండ, నొకఁ డొక కీర్తన పాడును. వినువారు ఆనందముననో, ఆశ్చర్యము

వనో విచారముననో మునిగిపోవుదురు. ఆకీర్తన మాని వట్టి స్వరముననే (అనగా సంగీతస్వరము, సరిగమలనే) అదియంత యుచర్విత చర్వణము గావించును. అప్పుడు వినువారిలో భావ మేముండును? ఆనందమో, ఆశ్చర్యమో తక్క మిగిలిన రసోదయముల కవకాశమెంత యున్నది? అదికాక సరిగమ లనుకూడ మాని వట్టి అకారోకారములనే (శ్రీహరినోంలు తంతంలు లేకుండనే యని యూహ) పాడి విడుచును. ఆనం దమో ఆశ్చర్యమో కాక అప్పుడాలోచన కవకాశమేపాటి కలదు? పాటకుడు మూతి, ముక్కు, కన్ను, మొగము విఱుచుకొని ప్రేక్షకుల భయపెట్టిననే తక్క అన్యాలోచన మునకు తావెంతకలదు? తిఱిగి యారాగమే యొక కీర్తనతో మేళవించి పాడెననుకొందము. అప్పుడు వినికిలో గల భేద మేమి? ఆనందము తొలినుండియు గమనించుచునే యుంటిమి? ఇప్పుడు నదియుండును. పోనిండు రాగమువిడిచి ఆకీర్తనయే పఠించునుగాక. అప్పు డానందమో ఆశ్చర్యమో యొక రస భావ ముండకపోదు గదా. కీర్తనయే కాదు, అట సమావేశ మైన జనమునకందరకు ప్రియమగు శుభమగు నొక వర్తమాన మావక్త తెలుపును. అప్పుడు నానందమునకుఁ గొఱఁత లేదు. ఐన నీయానందములలో భేదమేమి? ఈయానందమెట్లు కలిగినది?

వట్టిరాగమునే పాడినప్పుడు మాటలుకాని అక్షరములుకాని లేవుకదా. పద్యముకాని వాక్యముకాని ఐనచో అందక్షరములున్నవి. వాక్కులున్నవి. 'వాగర్థా' అని మహాకవి వాక్రుచ్చినట్లు దీనియందర్థస్ఫూర్తి వెంటనేవచ్చుచున్నది. కనుక యూహకు కారణమగుచున్నది. దానివలన రసోత్పత్తి. మొదటి దానియందిదమిత్థ మనురసస్ఫూర్తిలేదు. అట నున్న విధ్వనులు. శబ్దములు (పదములుకావు) అనగా నాదములు. (అవేస్వరములు) అవికొన్ని కలసి యింపైన నానందమును, 'ఎంతయింపుగనున్నవి!' యనుకొనినపు డాశ్చర్యమును గలిగించును. అందలి రసస్ఫూర్తి తద్ధ్వనిరూపనిరూపణముననే యాధారపడియుండును. బెబ్బులియఱచిన ధ్వనికి వెఱపు. తుపాకిప్రేలిన నులికిపాటు, పైదూలమునుండి బల్లికాని తేలు కాని క్రిందపడి శబ్దించిన త్రొట్రుపాటు, ఇట్టిదొక స్ఫురణము. పాటకుఁడే యొక్కొక్కెడ కంఠమెత్తగనే పిల్లలులికిపడుటయు మన మెఱుఁగుదుము. పాపమా వెంగలి సంగీతమను భ్రాంతి తోడనే కేకవైచును. దాని కదరిపడు ప్రాణులు పెక్కులుండును. పాపమొక అరవపాటకుఁడు రాగమధ్యమున మధురముగనున్నయెడ నొక్కొక్క స్వరము పట్టునపుడు తద్రసాభాసముగ మనకు శోకకరుణము లుప్పతిల్లఁజేయును. ఇవన్నియు నాదముల వలన స్ఫురితములే. ఆనాదములే సాంకేతిక పద్ధతిని కలసినపుడు అక్షరానుగతి, పదానుగతి, వాక్యాను

గతిని భావస్ఫురణమునకు, అర్థస్ఫురణమునకు తద్ద్వారా రసస్ఫురణమునకు కారణములగుచున్నవి. అట్టి నాదస్వరూప నిర్ణయమే మనకిపుడు ప్రస్తుతాంశము.

శరీరపటము చూచినచో గొంతులో రెండు గొట్టము లుండును. అందొకటి యూపిరిగొట్టము. అది ఇరువైపుల శ్వాసకోశములలోనికి పీల్చుగాలికిని విడుచుగాలికిని దారి. ఆయూపిరిగొట్టముపై నొక మూఁతయుండును. ఈలోపలి గాలియే ప్రాణవాయువు. మితభాషణమునుగూర్చి మన శాస్త్రవేత్తలు గావించిన గంభీరోపన్యాసము లీవాయువ్యయము కాకుండుటకే. ప్రాణాయామమున పూరకకుంభక రేచకముల యుద్దేశము నదియే. ఆమూఁతచేయుపనులు వివార సంవారములు. అప్పుడు లోనుండి వెలికివచ్చు గాలికి కొంత యొత్తిడియు నుండును. ఆవచ్చుగాలియొక్క మార్గ నిరోధమునుఁబట్టియు పలుచఁదనము చిక్కదనమును బట్టియు ధ్వనులేర్పడును. ఇదియందరకుఁ దెలియునాదము. కాని హేమాహేమీలమని తమకుతామనుకొనుచు మనల గూడననునట్లు చేసిన యేపాశ్చాత్య దేశస్థునకు నే పాశ్చాత్య విద్యాగరిష్ఠునకు నేటికిని గోచరముకాక తలక్రిందైనను ఆవగింజలో నరువదవవంతు తెలియక, యొక్క పవిత్ర భారతభూమిని వసించిన వారిలో పెక్కుమంది కవలీలగఁ దెలిసిన నాదములు మఱికొన్నియున్నవి. అవిపతంజలి పేర్కొనినాడు. త్రీణి నేంగయంతి

యని అందు మూడు వ్యక్తములు కావు. యోగాభ్యాసులకే నుగోచరములు. గర్భస్థములుగనున్నవి. పరాపశ్యంతీమధ్యమా యనునవి. నాలుగవది పైన పేర్కొనఁబడినది యందరకు శ్రవణగోచరమగునది వైఖరి.

ఇందు పెక్కు ధ్వనులున్నవి. పొట్టివి పొడుగువి. వలుచనివి. దళసరివి. ఇందును పూతి తెఱచుట నాల్కదగులుట దౌడలంటుట మొదలగునవి ఆగాలి వెలికివచ్చునపుడు జఱుగుచుండును. అవుడాగాలి ఆయాచోటుల సంఘర్షించి యొక నాదమును గలిగించును. అట్టి యుత్పత్తి స్థానములఁ బట్టియూ భేదము లేర్పడినవి.

నేటి పదార్థ విజ్ఞానశాస్త్రజ్ఞుల (Scientists) కెట్టివస్తు జిజ్ఞాస కలదో అట్టిది మన పూర్వికుల కెంత యుండెనో యిట చెప్పఁబోవు నంశములవలననే ప్రద్యోతము కాఁగలదు. ఉత్పత్తి స్థానములఁ బట్టి భేదవిభేదములు కొన్ని పాశ్చాత్యభాషల లోను గలవు కాని యవియైనను ఆర్యభాషయగు సంస్కృత భాషా సదృశములగువానియందే యున్నవి కాని దేశభాష లలో నున్న. ఇప్పుడిప్పుడు భాషావేత్తలు (linguists) తం టాలుపడి సమర్థించుటకు దేశభాషలలో గూడ సమాకరించు చున్నవారు. మనలోను వారిలోను సమానముగఁ గలవి కంఠ్యతాలవ్య మూర్ధన్య దంత్యోష్ఠ్యాదివిభాగములు. జర్మన్ (ఇండో జర్మన్) భాషలో, ముందు, వెనుక, నడిమి, యనికంఠ్య

ములలో కొంది భేదము లున్నవి. ఆర్యావర్తమున గల మహాసీయుల, నేటి నాగరిక తాపటిష్ఠులు కాని,—నూటు బూటు కళ్లజోళ్లు చేతిగడియారములు ధరింపని, — వంటలు కేలు జేసి ములు గొని పిట్టవిగని, — మిడిమిడి జ్ఞానముతో సంఘములు మూల విచ్ఛేదమునకు యత్నింపని,—మునిపుంగవులు, పరిశోధనాతిశయమును పరికింపుడు. నాదమును మొదల ఉదాత్త అనుదాత్త స్వరితములని విభజించిరి. ఇందు మాత్రలనిర్ణయము మున ప్లుతములు చేర్చిరి. (ఇవన్నియు వైదికభేదములే యని గుర్తింపవలయును.) ఆపైన వివారసంవార, అల్పప్రాణ మహాప్రాణ, ఘోష అఘోష, నాదశ్వాస, జిహ్వామూలీయ ఉపధ్మానీయ — ఇట్లు వారికి వీలగునంత వరకు విభజించి చేర్చిరి. అచ్చులు హల్లులనని (స్వరవ్యంజనములు) మొదటి భేదము. స్థానములం బట్టిన విభజన పైననే చెప్పబడినది. ఈ నాదమునే లెక్కలలోనికి దింపి లఘుగురుభేదము చెప్పిరి. ఇవన్నియు భాషోత్పత్తిక్రమములు. కేవల నాదవిభజనలో మఱియు నొక విశేష మార్గ మవలంబించిరి. ఈనాద మనునది ఒక మనుష్యుని నోటనుండియే వచ్చునా యను శంకకు జవాబు మన ఋషులే చూపిరి. వారు ముముక్షువులై ముక్కు మూసి కొని కూరుచుండినను స్వార్థపరులే కాక లోకకల్యాణము కొఱకు పాటుపడి రనుట కివియు నిదర్శనములే. వారు ధ్యానమున నుండగ ఓంకారమను ప్రణవనాదము వినవచ్చిన దనిరి.

అది కొన్ని ధ్వనుల కలయికయై యున్నది. అట్లు వారన్వే షించునపుడు మానవకృతధ్వనినే కాక చుట్టునుండు పశు పక్ష్యాది తిర్యగ్జంతువుల ధ్వనులు మఱి యితర జడపదార్థ సంఘర్షణములవలనగలుగు ధ్వనులును పరికించిరి. అది వ్యాకర్తలకును, యోగశాస్త్రజ్ఞులకును తెలియఁగలదు. తప్పెటలధ్వని కాహళధ్వని, తూర్యధ్వని, హయగజకంఠధ్వని, పికకీరమయూరకంఠధ్వని, యివన్నియుఁ దులకించి వీని గతు లనుఁ బరీక్షించిరి. అప్పుడు వారు సప్తధ్వనులు గుఱితించిరి. అవియే సరిగమాదులు. అవి ఆయా ధ్వనులకు సంకేతములు. రి, వృషభ మఱచు ధోరణి, గ, అజకంఠము, ఇట్లే హయహేష, గజఘీంకృతి; పంచమము కోకిల, నిషాదము కాకి, షడ్జమము నెమలి. ఇంతటితో నారికి సంతృప్తి కలుగలేదు. వృషభము నను మూడు తరగతులు (శుద్ధ, చతుశ్శ్రుతి, షట్శ్రుతి,) గాంధారమున మూడు (శుద్ధసాధారణ, అంతర్గాంధారములని) మధ్యమము (శుద్ధమధ్యమము ప్రతిమధ్యమములని) దైవతము (శుద్ధచతుష్షట్శ్రుతులని మూటిగను) నిషాదమును (కైశికి కాకలి యని) గుడ్లగూబ కాకి యఱుపులుగను పరిగణించిరి. ఇట్లు నాదమును మంద్రతారవ్యవస్థలలో, సాంద్రతాభేదములఁ బట్టిపదునైదురీతులుగమనించిరి. ఇందుకొన్ని (మూడునాలుగు) నామాంతరములు, స్వరగతిని తులితములు కనుక పండ్రెండు పదమూడుగ నున్నవి. నాదోపాసన చేయువారివి తెలిసి క్రిందివి

పైవి యను స్థాయిభేదములుగ పాతిక (ఇరువదియైదు) రీతు లగు ధ్వనులను పరికించుటకు గళమును స్వాధీనము చేసికొన వలయును. సంగీతపరిశ్రమ యన మనవారి యభిప్రాయ మిది. పాశ్చాత్యులదో యపశ్రుతి హార్మోనియముకంటె నధ్వాన్న మగు పియానోపై, వారు పైకి లాగిన క్రిందికి, క్రిందికి లాగిన పైకి బోవు నస్వాధీన తనఖాదస్తావేజులవంటి కంఠములతో కేకలువైచి మిఱిసిపోవు సంగీతమున కృషియట్టిది. ఇందేది నాగరికత యను సమస్యయే యిపుడు దేశములను తబ్బిబ్బు చేయుచున్నది. మనము బానిసల మగుటచే, భావదాస్యము మన సొమ్మై యగుటచే పైచేయి వారిదే యని నా మనవి.

మఱియొకతూరి సాహిత్యరంగమునఁ బ్రవేశింపవల యును. రంగములు మారుచున్నఁగాని నాటకమున నందమే లేదనికదా అంకమునకు సంబంధమున్నను లేకున్నను,—బాగుం డదనియో, పంతులు చిన్నఁబుచ్చుకొనుననియో, లేక చిద్విలాసమునకో కాలేజీవిద్యార్థులు పరీక్షలయందు వ్యాస ములలో పుటకు పదివదేనైన కొలిచి సద్దుబాటుచేసి యచ్చ టచ్చట అరసున్నలు శకటరేఫములు ఫర్లాంగురాళ్ళవలె తగిలించినట్లు, మన నవీన నాటకకర్తలును ఐదారైన రంగములు లంకించుచుండుట. కనుక రంగములు మార్చుట ముఖ్యము. సాహిత్యరంగమునకు పూర్వము మనకు కొన్ని పాత్రలు పరికరములు కావలయును. మొదటిపాత్ర

ఇంగ్లీషుభాషాధ్యాపకుఁడు. వానిచేతనొక బెత్తము ఇంగ్లీషక్షర
ముల పటము. ఇతఁడు చిన్నతరగతులలో మూతిముక్కు-
ద్రిప్పుచు డాబు దర్పముచూపుచు 'వ్హాట్' (what) బా—
యిస్జ్ (boys) ప్లెయి (play) క్లెవ (clever) అని మాత్ర
మే అభినయించును. పటాలలోఁ బడి తిఱిగితిఱిగి భావదా
స్యము పూర్ణమై ఘనీభవించిన బానిసియై బోధకశిక్షణా
తరగతికి (బి. యిడి.) వచ్చునరికి వానివలన మాయమర్మ
మెఱుఁగని మఱికొందరు పసివారు భ్రష్టులగునట్లు చేయఁగల
తాహతు గలిగించి పంపుట కాపెద్దతరగతిలో పై ఆంగ్లేయ
భాషాధ్యాపకుఁ డొకపటమును (Phonetic Script), చేత
కఱ్ఱనుఁబట్టి, శర్విలకుని దొంగతనములో నీతివెదకునట్లు,
ఔరంగజేబు పాత్యాలలో పరమార్థమున కెదురుచూచునట్లు,
లాటీజొబ్బులలో లా ఆర్డరులున్నవని సంతృప్తిపడినట్లు, యుద్ధ
ములలో విదురశుక్రనీతిసారముల (Ethics of war) మించిన
మహోపదేశ ముండుననునట్లు, పొందికపోలిక పుట్టుకలేని
యక్కరములలో శాస్త్ర సౌలభ్యములు విజ్ఞానములు—నెత్తి,
పొడియినుకలోనుండి తైలముదీయునట్లు లసమర్థప్రయత్న
ములుచేసి నూఱిపోసి బోధించును. వానిపాటు, వినువారిపాటు,
పట్టగ్రహపాటే కాక భగవంతునిపొరపాటే. ఏ. బి. యఫ్.
క్యు. వై. యక్స్. జడ్ ఈయక్షరములలో నొక్కొక్కదానికి
గల పారస్పర్యమేమి? ఇంతకు మించిన నాగరకభాష అలీఫ్ బే

ఉబ్ అలీఫ్ జేజర్ బబ్—ఇవి యేకాక్షరముల నెలుకపలుచు ధ్వనులట—పియుటి పుట్, బియుటి బట్, డబ్లియుఆర్ యియేకే (రీక్) ఇందు డబ్లియు వ్యర్థము. అదేమాదిరిని బిఆర్ యి యేకే (బ్రేక్) ఇట నేత్వము బియుఆర్వై (బెరీ) జేయు ఆర్వై (జూరీ); సైకాలజీలో ఐత్వము, 'పి' 'హెచ్' వ్యర్థములు. సిమ్మెట్రీలో ఇత్వము, 'ఒయు, ఒకచో 'ఔ', ఒకచో 'అ,—యల్ ఆర్, అక్షరములు పెక్కు చోట్ల నిరర్థకములే. ఇంక ఫ్రెంచిభాష—వారిప్పుడు ప్రపంచమునందన్ని దేశములలోను నాగరకులు. నాగరికతవారి సొమ్ము. వారి భూమిలోనే దొరికినగని. వారిలో అచ్చులకు అనగా ప్రాణాక్షరములకు తావుచాల తక్కువ. తద్వ్యతిరిక్తములగు హల్లులు ఉచ్చారణకు కూడ లొంగక 'రీసర్వేరాళ్ళ'వలె, నుండియు లెక్కపరిగణింపనివాదిరిని ఐదా రొకచోటనే కట్టుకట్టుకొనియుండును. వానిధ్వని మన భరత భూమికి దేవుడైన బ్రహ్మకు సాధ్యముకాదు. వారిబ్రహ్మ కేమో—మనకు తెలియదు.

దేవభాషయని మనము గంతులు వేయుచున్న (అసలే గీర్వాణము) గీర్వాణభాష విషయమేమి? దాని ననుసరించి పుట్టిన తెలుఁగుమొదలగు వాని విషయమేమి? చూడుఁడు. 'ఓంనమఃశివాయ సిద్ధం నమః' యని బాలురకు హితైషులుగ మంత్రోపదేశము చేయుట యటుంచి, మొదలు ప్రాణాక్షర

ములు, (ఏవిలేనిచో కట్టెలవంటి శరీరములు నిలువవో, అవి) అట్లే వ్యంజనములకు పూర్వము చెప్పుట, అందు క్రమము, కుఱుచ, పొడవు, అ, ఆ ఇ, ఈ పిదప పిపిమాత్రలు ద్విగుణించుటకాక ఇంకను వృద్ధిచేసి, (ఎ) ఏ (ఒ) ఓ ఐ పిదప ఐ ఔ లు ఱపై బిందువిసర్గలు వఠింపజేసి నిర్జీవాక్షరములగు క్, ఖ్, గ్, ఘ్, చ్, ఛ్ ఇట్టి వాని కొత్తొలి ప్రాణముపోసి సాకారములు చేసి అందు వర్గనియమము (ఉత్పత్తి) త్రిస్థాన నియమము నను సరించి) పైనున్న ప్రాణముల నన్నిటిని తిరిగి తిరిగి యొక్కొక్క నిర్జీవాక్షరమునకుం బోసి సజీవాక్షరములుగం జేసి ఆనందింపం జేయు బోధనాపద్ధతి యిది. దీనికొక యుపమానము చెప్పిన బాగుగం దెలియును. అందమును చందమును లేక పడియున్న మట్టిని కుమ్మరి ముందట ననువు చేయును. ఆపై కొన్ని చిన్న విగ్రహములు కొన్ని పెద్దవిగను అచ్చులు వేయును. ఆపై కొన్నిటికొకటి కొన్నిటికి రెండు గీతలు వెట్టును. కొన్నిటికి పుట్లు పెట్టును. కొన్నిటికి మహాతులు కొన్నిటికి కనువులు వెట్టును. కొన్నిటికి మూతులు వెట్టును. ఇది నిర్మాణక్రమము. అట్లే శిల్పి పునాది వేయుంగనే గోడలు కట్టును. పైన నిండ్లలో భేదములు చూపును. అట్లే చిత్రలేఖనము. అదే సృష్టికర్తచేయు పనియును. వస్తుసామగ్రి అచ్చులు హల్లులుచూపి అవసరమునుంబట్టి కావలసినది కావలసినదాని కదికి అభీష్టకల్పనము కావించికొనుట. ఆపిదప నట్టివి మఱికొన్ని సంయో

గించి సంయుక్తాక్షరములు సృష్టించుట ఇందుచ్చారణభేదమున
కెడములేదు. నాలుకగీచికొనక నాగరికులవలె పాచిని చెట్టికొని
బండబాఱిన జిహ్వాలుగలవారి నోళ్లలోదక్క ఉచ్చారణక్లేశ
మేలేదు. ఎన్నివేలేండ్లకైనను ఎన్నికోట్ల ప్రజలకైనను ఒకే
త్రోవ. వ్యక్తినిబట్టి గడియనుబట్టి మారదు. ఇది ఈ భూమి
యందు బోధనాపద్ధతి. శిక్షణాక్రమము. భాషలోగల వస్తు
తత్త్వమిది. ఇంకేది నాగరికలక్షణమో మఱియొక సమస్య—బాహా
టమునకు పైకి పరిష్కరించుటకు నోరురాక నత్తివాని గొణు
గుడువలె అస్ఫుటమై యుండిపోయినది. నదురుబెదురు లేని
నాజవాబేసుందురా? ఏబదిరెండక్షరము లేమిటికిపీడ? ఇన్ని
వఱించి జ్ఞప్తియుంచికొని బాధపడుటేల? క్రమమో అక్ర
మమో ఇందు కొన్ని విసర్జించి పాతికో పదకో నాగరిక
భాషలలో వలె స్వేచ్ఛగతోచిన ధ్వనులేరికొని భాషనిర్మిం
చుటయే సుఖము. అప్పుడు కష్టమని తోచినచో బైసికిల్,
సైకిల్, బైక్ అయినట్లు గవర్నమెంట్ గవ్ట్ అయినట్లు, పోలీ
స్ సర్కిల్ ఇన్స్పెక్టరు, సర్కిల్ అయినట్లు, శ్రీకాకుళము చికోల్,
మచిలీపట్టణము, మసులా, విశాఖపట్టము, వైజాగ్ అయినట్లు
జిగ్ జాగ్ గా మార్చికోవచ్చును. ఒకవ్యక్తిని మఱొకవ్యక్తి
నుండి వేఱుఱచి చెప్పుటకు (Entity and identity కొఱకు)
తొలుతనే పెట్టిన పేరులు, వ్యక్తియు, వ్యక్తిలోని శక్తియు దేహ
శక్తియుకూడ) నే యంశలో మాఱుచున్నవో (whether

Direct ratio or inverse) అది పరిశోధకుల (Research scholars) బాధ్యతకాని ఆ పేరులు హాస్యములై నరసింహము యస్. హామ్, గను, సీతారామయ్యరావులు, యస్. రామ్ (S. Ram) లుగను, మఱికొన్ని పేరులడుగంటి యింటి పేరుతే మిగిలినవిగను, పెద్దవారి నోళ్లలో రావులుకోవులు గను, తారాస్మైకులగునప్పుడు, ఇట్లు మనుష్యులు, వారి నామరూపములు కొఱతవడుచున్నప్పుడు నిక మీసములు పొట్టివగుట జాకెట్లు కోట్లు పొట్టివగుట యొకలెక్కా? మఱి మనయిష్టము వచ్చినట్లు వినవలసిన మాటలు నశ్వరములునా? ఎట్లుకావసిన నట్లే మార్చికొనవచ్చును. పోనిండు.

ఇట్టి యక్షరములు కలసి మాటలుగను కొన్ని మాటలు వాక్యములుగను కలియుచున్నవి. అందొక్కొక్క యక్షరము మఱియొక యక్షరముతో కూడినపు డొక్కొక్క యర్థమును స్ఫురింపఁ జేయుచున్నది. ఇట్టి భేదోచ్చారణములు విభేద ధ్వనులు, తత్తద్భేదార్థములు నెఱుఁగుటయే సృష్టిలోగల ప్రాణికోటిలో, జంతుకోటిలో మానవునకుగల యాధిక్యము. ప్రతిజంతువును తన అభిప్రాయమును వెలిఁబుచ్చుట కొకరీతి ధ్వనిగావించును. లేక అభినయించును. తోక నాడించుట, అఱచుట, నాకుట, తలయెత్తుట. కూయుట, బుస్సుకొట్టుట యివియన్నియు సూహాలే కాని మాటలోపించుటచే చాలవఱకు దురవగాహములు. సామాన్యార్థములు ప్రేమకోపాతి

శయములే తెలియనగును కాని మాటలచే భావచేవల, స్పష్టీక
రించుటకుగల యవకాశములు లేకున్నవి. ఆవేశమున నొక్కొ-
కప్పుడు మాట మాటుపడి యభినయముననే వెలువఱుపయు
గలదు. అది అసంపూర్తియే. భాషవలనిప్రయోజనమో,
విపులముగ నెఱుంగఁ గలుగుట.

ఈ మాటలాడుటలోనే పలువురు పలుతెఱంగు [illegible]ం
బింతురు. ఒకొకఁడు పట్టి మాటాడును. ఒకొకఁడు ముసుకు
తనముగ పలుకును. ఒకొకఁడు యమకములతో మాటాడును.
మఱొకఁడు నియమముగ మాటాడును. ఒకడు సూటిగ
చెప్పును ఒకడు త్రిప్పిత్రిప్పి చెప్పును. ఒకడు చమత్కారముగ
పలుకును. ఒకడు మోటుతనముగ నుడువును. ఆ భావమునే
మఱొకడు వినిఁగింపక హృదయాహ్లాదకరముగ తెలుపును.
ఒకడు క్లుప్తముగ నొడువును. ఇంకొకడు శ్లేషించును. ఇవ
న్నియు నాయావ్యక్తుల మనస్సులనుఁ బట్టియు వారి కళను
బట్టియు వారి వారి సమర్థతలఁబట్టియు నుండును. ఇవియే
శైలీభేదములగుచున్నవి. ఇవియే గౌడీవైదర్భిరీతులు. ఇవియే
కైశిక్యార్భట్యాదులు. ఇవి యేవక్రోక్తి మొదలైన యలం
కారోత్పత్తిక్రమములు. వీని నెఱుంగుటకు పఠించునవే సాహిత్య
గ్రంథములు. ఇదియే భాషాభివృద్ధి లక్షణము.

మఱియొక విశేషము ఈ ధోరణులలోనే ఒక్కొక్కరి
మాటలనడక యొక్కొక్కరీతి. అవియే వివిధగమకములు,

యమకములు. అట్టిమాటలే మఱికొన్ని నియమములకు కొలతలకు లోనై యుండును. అవియే ఛందోరూపములగు చున్నవి. అట్టి నియమితచ్ఛందములు, పరిమిత వాక్యములుగా యమములు పఠించు క్రమమునకే లయ యని వ్యవహరించిరి. ఈలయ యనునది క్షణికత్వమును మాత్రను సూచించునది (It is a unit in one sense) వ్యాకర్తలు నాదస్వరూ నిర్ణయమున స్ఫోటవాదమును నన్యథావాదమును జర్చించిరి. అట తేలిన సారాంశము నాదము క్షణికమనియే. ఒకనాదము వెలువడి అది వెంటనే లీనమైపోవును. అది నశించును. దాని స్మృతి మాత్రమే నిలుచును. తరువాత వచ్చునాదములతో అనగా వాని స్మృతులతో ఒకదానితో నొకట కలసినపుడు ఆస్మృతులవలన గలుగు భావనయే అర్థము. స్మృతియే అర్థము. ఇది చాల దీర్ఘవాదము దీనినుండి తర్కించవలెను బడ వలసిన యవసరముండుటచే దీని నింతలో ముగించుట మంచిది.

'లయ' అనగా నశించుట. అది ఒక అక్షరముగా, రెండుగా, నాలుగుగా లయింపజేయుట యొక్క పద్ధతి. ఒక ఛందస్సు యెనిమిది అక్షరముల పొడవు. అంతవఱకు దానిని నడపి అంతితో దానిని లయింపజేసి తిఱిగి పునరావృత్తిగ మఱెనిమి దక్షరములు గైకొందుము. ఒకెడ పందొమ్మిది. మఱొకచో ఇరువది. వీనికే వైయాకరణులు సాహిత్యకారులు ఛందములనియు వృత్తములనియు (చంపకము, ఉత్పలము,

అనుష్టుప్, గాయత్రీ, త్రిష్టుప్ మున్నగునవి) పేరు లిడిరి. ఈ మాత్రల పరిమితినే సంగీతమున తాళములని లయ యని వ్యవహరించిరి. ఈ సంగీతము వేదముననే యున్నది కాని క్రొత్తది కాదు. సామవేదమును అందలి ఛంధస్సులను పాడుట కుద్యమించిరి. ఋక్కులకు పఠనమున ప్రత్యేకగతి యున్నది. ఆ గతులు క్రమముగ వృద్ధినొందినవి. వీని కన్నిటికి శ్రుతి ప్రధానము. ఒకడు మాటాడునప్పుడు వాని కంఠమున గల మాధుర్యమును బట్టి జనుల నాకర్షింపఁగలుగును. అది శారీరమని గాయకులు చెప్పుదురు. అదే గాత్రము. కనుకనే సంగీతము కొంతవఱకు సహజమనుట. సంగీతమునకు శ్రుతి మాతయని, లయ పితయనియు వాడుదురు. శ్రుతి యనగా చెవికి యనుభవము వేదమనియు నర్థములు. వేదమే తొలుత దీని పోషించినది. కేవలనాదస్వరూప మగుట వినికియే దీనిని పోషించునది. ఆ వినికిలో శిక్షితమగు రీతి నుండుటకు చెవికి గూడ శిక్షణము నొసఁగవలయును. అది సరిచేయుటకే గాయకుఁడు ప్రక్కను మఱొక యంత్రమును శ్రుతిగా నిలుపుకొనును. కంఠము నటునిటు తొలఁగనీక యా శ్రుతి అదుపునాఁనల నడపుచుండును. అట్టి లయశ్రుతులతో ఒక కొన్ని రీతుల నాదముల మేళగించిన నొక ఫక్కిగను మఱికొన్ని రీతుల నాదములు మేళవించిన మఱొక ఫక్కిగను శ్రోతల కింపు గావించుచుండును. ఇవియే రాగభేదములు గమకభేదములు.

కేవల స్వరరూపమగు సకారేకారోకారముల కంతగ నర్థములేదని ముందే మనవి చేసితిని. కనుక నాదస్వరూపమగు లయశ్రుతిపూర్వకమగు గానమునకు అర్థములేదు. అది కేవల శ్రవణేంద్రియప్రీతి గలిగించి ఆరీతి హృదయంగమమగుటయే దానినైజము. కనుకనే గాయకుఁడు కంఠముతో బాడుట కవకాశము లేనప్పుడు యంత్రములతోగూడ ఆయాధ్వనులు వెలువరించును. అపుడా తీగలపైనుండి వచ్చు నాదము కేవల స్వరరూపమేకాని భాషలోగల అక్షరములు గావుకదా. వసుచరిత్రయంతయు వీణపై వాయింపవచ్చునని యొక సుప్రసిద్ధపండితుఁ డనెనట. ఎట్టి భ్రాంతి! అటులైన మనుచరిత్ర ఏలకాదు? వేమనపద్యము లేలకావు? గోంగూర్పాట చల్ మోహానరంగ యేలకావు? సంగీతములో గల కళావిశేషమునుఁ బట్టియే అందలి ఇంపుసొంపుల తారతమ్యము లేర్పడును. కేవల పాండిత్యప్రకర్షకుదిగి సాము చేసి ముచ్చెమటలుఁ బట్టి బాధపడి స్వరములు (సరిగమలతో శ్రోతల నేడిపించుగాయకులను గని యేముదుసలివారో లేక పెద్దమనుష్యులో జాలిపడవలసినదే కాని మిగిలినవారందరు తిట్టువారే అయినచో సంగీతమా? అవగీతమా? దుర్గీతమా? కాని అమాయికులగు చాలమంది పాడువారుఁనోటనెన్ని సరిగమలు గ్రుక్కలో ననగలిగిననంత సంగీతమని భ్రమించుటనే నెఱుగుదును. అవి చిలుకలవలె వల్లించినవో, లేక పాఠము

తోనివో మఱి తప్పో యొప్పో తెలియక నిశ్చేష్టులై వెఱ్ఱిగ తలలూపుచుండువారే సగముమంది సభ్యులు. గాయకునిబుద్ధి ఆతఁడేరుకొను స్వరములలో పోవునడకలలో నుంకును. అది అనుభవమున కొంతవఱకు లభించునుగాని స్వారస్యసుకృతము వనే సంపూర్ణముగ ప్రాప్తించును.

అట్లే కవిత్వము, సాహిత్యము. చదువుకొనువారికి చాలమందికి భాషలో చాలమాటలు కంఠస్థములే కాని యొక్కొక్క రొక్క భావమునే వేఱువేఱు మాటలుగ వ్యక్త పఱతురు. ఒకరి కవిత్వము సున్నితము. ఒకరిది పెళుసు. ఒక రిది చమత్కారము. అది వారువారు, ఆభావమును వెల్ల డించుట కుపయోగించు పరికరములలో నున్నది. ఆమాట లలో, ఆపోకడలలో, ఆపొందికలలో ఆరసపుష్టి యిమిడియు న్నది. ఒకేరాగమును పెక్కునోళ్ల వింటిమి. ఒకరిది ఏడ్పివ ట్లుండును. మఱొకరి ధోరణి ముద్దువచ్చును. ఒకరు వరవశు లనుఁ జేయుదురు. ఒకరిమొగము చూడగనే ఆనందము పార వశ్యము, ముద్దు, ముచ్చట, ప్రేమ ముప్పిరిగొనును. ఒకరి మొగమున మొద్దులుపెట్ట బుద్ధిపుట్టును. అందుకు వారెట్టి బాధ్యులు? అవి వారివారి పూర్వపుణ్యఫలితములు.

ఈసందర్భముననే మఱొక మనవి. వారివారి పూర్వ పుణ్యము లెట్లున్నను, ఎవరిముట్టుకువారే చాలా సొగసుగా నుండవలెనని యత్నించువారు, ఫేస్‌పౌడరులు వ్రాసికొను

వారు, నిత్యక్షౌరములు చేసికొనువారు, అద్దము చూచికొని అదేపనిగ ముఱిసికొనిపోవువారు నయ్యును పరహృదయ రంజన మెందరికి సాధ్యమగుచున్నది? ఎంతయో చమత్కారముగ బ్రసంగింపఁబోయి బోర్లపడువా రెందరు? చూడుడు! భోజనపంక్తులలో పాటగాండ్రను బ్రక్కవారు బ్రతిమాలుచుండ పంతముగాని బాధించుటకో యనునట్లు పండ్లూడిన బావన్నగారు పాతికముప్పది పద్యములుపాటలు పీడించి పాడుట యేటికి? ఎంతో యింపుగనుండితీరునని యే పాపము వాని యవస్థ అట్లే గానసభలో 'సరిగమల సందడి,' చావంతపనిగ మూతివిఱుపు, ముక్కు విఱుపు. అటునిటు దేకుచు దేవులాడుట. అంత యెందులకు పత్రికలలో తమాషాలని, నవ్వులని, హాస్యములని వ్రాసి యాతనపడుట ఏల చమత్కరించుచుంటిమను మౌఢ్యమే కదా. నవ్వులేనంగు కేడువని చదువరులంద రెఱుఁగుదురు! ఆకథల యాగడమేల? అందరు వారిపేరే స్మరించి వారినే చదువుచున్నారనుకొను వెఱ్ఱియే కాకున్న నిందరు కవులేల? ఇట్టి వెఱ్ఱిని గల్పించి, ఇట్టి యాతనల పాలునేసి, యిట్టులాడించుట కీ కవిత్వమున నీసంగీతమున నీ రెంటియందు నేదే నొక యాత్కృష్ట్యముండవలయును. లేనిచో పాపము తెలుగుపారమును చెప్పు పంతులు పిల్లలు నవ్వుచున్నారనియో నవ్వుదురనియో బిడియమైన లేక యొక పిచ్చిరాగ మేలతీయును? అనగననగ రాగమతిశ

యిల్లునసియా? ఈపంచరత్నకవులు, నవరత్నకవులు, సహయ కవులు, ఎలెక్షను (ఎన్నికల) కవులు, అభినందనకవులు, ఉక్కిరిబిక్కిరి కవులు, గోలకవులు, తందనాల కవులు నింద లేల? అభ్యాసం కూసువిద్యయని పెద్దలందురు కనుకనా? వ్రాయగ వ్రాయగ వారే వ్రాతకారులు కావచ్చునని కాబోలు. అవి పెట్టిపుట్టినవారికే అట్టిది సాధ్యము అట్టివారి కది అభ్యాసము కావచ్చును. లేనివారి కది అడవిపదము. వస్తువే లేనిదే మెఱుగు దేనికి?

సరి. పైన నీరెంటియం దేదేనోత్కృష్ట్య ముండవలె ననుకొంటిమి. అది తరువాత పరిశలింపవచ్చును. ఉత్కృష్టత గలిగిన యీ సంగీతసాహిత్యములస్థితి యెట్లున్నది? చూడు దగిన విషయము సంగీతము పుట్టినప్పటి విషయము కాదు కాని ఈ మధ్యనడ భాగవతుల వశమునను, 'కళావంతుల' యను వేశ్యల యిండ్లను బడిపోయినది. వేశ్యలనోళ్లబడిన కతమున నారెంత వఱకు సరసుడ అని జాలమేలర లేచిరారాయని విరహాములు మోవులు చూపవలసినవారే యగుట వర్ణములన్నియు నిట్లు నుళువైనవియు రసికులను గ్రామ్యవిటుల నాకర్షింపవలసినవియు నగు నిట్టి పదములతో వెల్లివిరిసినవి. ఇవి సంగీతవిద్యకు పునాదులవంటి వగుటచే గృహస్థులు సంసారులు నిట్టి సంగీత మును తమపిల్లలకు నేర్పింపవెఱచిరి. కొలదికాలముక్రిందట హార్మోనియమున్న యిల్లు 'బోగముకొంప' యనునంతటి

వారు, నిత్యక్షౌరములు చేసికొనువారు, అద్దము చూచికొని
అదేపనిగ ముఱిసికొనిపోవువారు నయ్యెను. పరహృదయ
రంజన మెందరికి సాధ్యమగుచున్నది? ఎంతదో చమత్కా
రముగ ప్రసంగింపఁబోయి బోర్లపడువా రెందఱు? చూడుడు!
భోజనపంక్తులలో పాటగాండ్రను ప్రక్కవారు ప్రతిమాలు
చుండ పంతముఁబూని బాధించుటయో యనునట్లు సంద్లూడిన
బావన్నగారు పాతికముప్పది పద్యములు పాటలు పీడించి పాడుట
యేటికి? ఎంతో యింపుగనుండితిననియే పాపము వాని
యవస్థ అట్లే గానసభలో 'సరిగమల సందడి' చావంతపనిగ
మూతివిఱుపు, ముక్కువిఱుపు. అటునిటు దేకుచు దేవులా
డుట. అంత యెందుకు పత్రికలలో తమాషాలని, నవ్వులని,
హాస్యములని వ్రాసి యాతనపడుట ఏల చమత్కరించు
చుంటిమను మాధ్యమే కదా. నవ్వులేనంత కేడుపని చదు
వరులందఱెఱుఁగుదురు! ఆకథల యాగడమేల? అందరు
వారిపేరే స్మరించి వారినే చదువుచున్నారనుకొను వెఱ్ఱియే
కాకున్న నిందఱు కవులేల? ఇట్టి వెఱ్ఱిని గల్పించి, ఇట్టి
యాతనల పాలుసేసి, యిట్టులాడించుటకే కవిత్వమున సంగీ
తమున నీ రెంటియందు నేదే నొక యాత్కృష్ట్యముండవల
యును. లేనిచో పాపము తెలుగుపాఠమును చెప్పు పంతులు
పిల్లలు నవ్వుచున్నారనియో నవ్వుదురనియో బిడియమైన
లేక యొక పిచ్చిరాగ మేలతీయును? అనగననగ రాగమతిశ

మరలమరల పుట్టుట లయమగుట ఇట్లైడ తెగనిదనియో నాద
మునుగాడ్చి 'అనంత' అని అజే అ——నం——తా౽——నం——
తా౽——నం——త అనియే పాడెనో అది యివ్వాడీ అభాగ్య
స్థితికి 'దుర్గతినో౦' లోనికి దిగినది. ఈస్థితిలో కొందరు 'సగుణుడా
జాలమేల' మొదలగు సాహిత్యములను తగ్గించి వట్టి ఆకారసాధ
కమునే పాడుటకు మటొక సాహిత్యము నమర్చులతొ తమా
తమాగలవారైరి. ఒకే రాగము నెన్ని పద్యములనైన నుపయో
గింపవచ్చును కదా. దానికి మంచి తారాణము శుభమని
పెండ్లిచేసికొని విందులు సేయుచుండగ పెండ్లిపందిరిలో ఒక వ్య
వహారము చదువుచున్న ఒక గాలిపాటకుని పదిమంది రెచ్చ
గొట్టి పాడింతురు. అతఁడు అనుకరణము అసమర్థుల ప్రథము
లక్షణ మగుటచే ప్రసిద్ధనటకుని 'ధోరణిని, "కాకోలు బ్రహ్మ
రత్నస్నమునావా' మని ఎత్తికొని, కాకోలు వీరు విగతజీవ బాంధ
వులు అడలుచుండిరి మహార్తారవముల" యని పందిరి నెగుర
గొట్టి పాట వినుదును. ఒక పుణ్యాత్ముఁడైన ఏమబ్బాయీ.
ఇంత తెలివిగలవాఁడవా ? యని యడుగడు. అడుగుటకు
ముందు వినువారి కది సుబోధమైనదగదా. పోనీ, ఏలక్ష్మీ
కళత్రమో, ఏఅంగనామంగనా మంతరమో లక్ష్మీకాంతం
కమలనయనమో, తెలియకపోయినయెడల ముఖారిమీద
నైనను పాడఁగూడదు. ? గయుని వేషధారి సంగీతము
ధోరణిలో పాతాళమున కేగి యని పాడుచు తనచేయి

నాకసమున, కెత్తును. ఎత్తిఎత్తి నొప్పిపెట్టి, నక్షత్రపథమున నణంగి యడుచు ఆచేతిని క్రిందికి దింపును. ప్రేక్షకకోటి యూ సంగీతమును చిలకమర్తివారి కవిత్వమును నెగాదిగ చూచు వారై తన్మయులగుటయు నేమూలనుండియో [illegible] [illegible] [illegible] 'మన్మ [illegible]' [illegible] [illegible] [illegible] [illegible] అభినయించుచు నలుకుడు పాడుటయు [illegible] ఆనందమును [illegible] బగినవి. "కల్యాణరేఖలవోలె కన్యాల వాండ్లో [illegible] మేఘజల్లు [illegible]" అని పాడుకొని [illegible] మాటలతోపరి కవి యర్థ [illegible] అంతేని [illegible] ఆ [illegible] మనసు దూరి [illegible] చేతనే. అట్లు కాదేని మన మొఱగని పార్కి, ఉంచమాస్థాని [illegible] [illegible] మొదటే తెలియని [illegible] అరసము, నేల [illegible]? మాటతే రాని, శిశువు జోలపాట కేల ఆనందించి [illegible]? [illegible] [illegible] యాలకించును? పాటేల పడగవిప్పి యాడును? అందలి అర్థమా? నాదమా? పరభావమద్దు. మనకు వచ్చిన భాషలో అపశబ్దములు మన మేల సైరించుచున్నాము? వానిని మన మేల సరకుగొనము?

1. 'అవివేకమానవుల కోరికోరి' అనుచో విరుద్ధార్థముగ అవివేకమా? నవుల (నవ్వుల) కోరికోరి—అని పాడినను అందలి లోపము మన చెవికే యెక్కదు?

కాదా? ఇట్టి దగాకోరినాదమేం ఇట్టి మాయలాడి యగా నాదమే. ఈ మైకమీనాదమే. ఏనాదమును నిజముగ గుర్తెరిగి క్షణభంగురానందముగాక తెలిచినకొలంది నిని తినినకొలంది తన్మయత్వము గలిగించి చిదానందసదానందముల గలిగింపఁజాలుదురో, అట్టి నాదోపాసనయే యేకొందఱినో మహానుభావులుగఁ జేయుచున్నది. వారే నాదబ్రహ్మలు వారే గాయకులు, వారే కవులు, కవిబ్రహ్మలు. అంతియు కాని బిరుదమాత్రులుగారు.

అట్టిదగుటనే షేక్స్పియర్ సంగీతమున కరగనివారిని ఆతతాయిత్రాగుబోతు జూదరులకంటె నికృష్టజాతిగ పరిగణించుట. మిల్టన్ కవి గాన జీవతనర్థించుట. మన కవులందరు చేయు పని యేమొయుడ. మనోరోగములకు మందులు లేవట, కాని సంగీతమునఁ గొన్ని కుదురవచ్చునని యిటీవలి పరిశోధకులు గుర్తించుచున్నారు. అపరాధపరిశోధనలలో నేరగాండ్రను పట్టుకొనుటకు సంగీతమును కూడ ఒకసాధనముగ చేయుచున్నట్లు గ్రంథములే యున్నవి. ఏమికాకున్నచో, 'రహీవృట్ట జంత్రిగాత్రముల చాల్గరగించు' అని వరూధిని రొమ్ముమీద చేయియుంచి కొని చెప్పగలుగును ?

రక్తి కలిగించుటకు పాటలుండఁగా విరక్తి గలిగించుటకును పాటలున్నవి. రాగము కలిగించుటకు వేశ్య యాడగా పాడగా విరాగము గలిగించుటకు 'బ్రహ్మ'మని 'గురుడా'యని

తత్త్వములున్నవి. భక్తి గలిగించుటకు పద్యములుండఁగా, విభక్తులుగాఁ జేయుటకు పదములు వెలిసినవి. మాటలలో చెప్పుటకంటె పాటలలో చెప్పిన చప్పున మనసున కెక్కుటయే యందలి మర్మము. గద్యముకన్న పద్యము బాలురకు వదిల పడును. పండితపామరుల నందర రజింపఁజేయునదీ నాదము. సులభముగ హృదయము నాకర్షింపఁగలది యీసంగీతము. పండితులకే యానందమీఁగలది యీనాదమేకాని యందలి విశేషము మాత్రమే (అనగా అందలి అరము). కనుకనే సంగీమును ముందు పేర్కొని సాహిత్యమును తరువాత చెప్పుట సంగీతమపి సాహిత్యమనిరి. ఇవిరెండును నాదమునుండిరే జనించినవికదా, యివి రెండును సరస్వతీ స్తనద్వయమనిరి. అండ సంగీతము ఆపాతమధురమనిరి రెండవది ఆలోచనామృతము. ఆలోచించి అర్థమరయువలయు నప్పుడే అందలి అమృతము ఆస్వాదనీయము.

మఱియొక అంతరమీ రెంటికి నున్నది. నాదము తు. కమని ముందే మెఱిఁగియుంటిమి. కావుననే ఒక పాటకుఁడు పాడినతరువాత వాని పాటనుగూర్చి ముచ్చటించునపుడు, "ఏమిపాట! చాల బాగున్నది! అమృతము కుఱిసిపోయిన" దను వారేకాని మఱునాఁడు, మఱునాఁడేకాదు, ఆమరునటి నిముసమున దాని స్వరూపమునుగూర్చి చెప్పలేరు. దాని

చూపలేరు. ఇది యిత్థమని చెప్పదానికి లేదు. నిర్వికారము. (మన పాటకుల చెంతమట్టుకది సవికారమే.)

సాహిత్యమునకును మాటలుగానే నిల్చియున్నచో నట్టి గతియే. దానికి లిపికూడ చేర్చబడి దానిని వ్రాసియుండుటచే మాటలు నిలిచి వానికర్థములు మిగిలినవి. అర్థసహితములై రూపసహితములై యుండుటచేతనే యిది సాహిత్యమైనది. నేటిమాటలు తిరిగి రేపుకూడ తెలియబడగలవు. నిర్వికార నాదమేకాక సాకారమగు నాదమగుచున్నది, కనుక ఇదిస్థిరము. వేయి యేండ్లక్రింద పలికిన నన్నయ ధోరణి తిక్కన భావన, శ్రీనాధుని పదజాలము, పోతన చిత్రలేఖనము, కాళిదాసుని కవనము, వాల్మీకి వ్యాసుల రచన, వేదముల ఘోష నేటికిని మన చెవుల సందడించుచున్నవి, మనమోల తాండవించుచున్నవి. ఇటీవలి వాడగు త్యాగరాజు పాడినరీతి అదృశ్యము, అనూహ్యము నైనది.

ఈ చెంతనే సన్నిహితత్వము నొందగలిగినది చిత్రలేఖనము. సంగీతమువలె పండితపామరరంజకమగునది. శ్రుతి మాత్రమున సంగీతమెట్లో దృష్టిమాత్రమున చిత్రలేఖనమట్లు. సాహిత్యమువలె దీనికి భావన తప్పనిసరి. "సాహిత్యకారుడూహించి మాటలతో మూర్తుల గోచరింపజేయును. చిత్రకారుడట్లే భావించి కాగితముపై వన్నెచిన్నెలతో ఆకారము నిర్ణయించును. ఒకరికొకరు సహకారులు. ఒకరి 'నకేవము'

లింకొకరు పూరింతురు. ఇరువురును గలసిన భావనకు సంభావనకలదు. రవివర్మవలన పురాణప్రబంధపురుషులు అందరకు దృగ్గోచరులు గాఁగలిగిరి. వానిపటములు పెక్కుఁరు కవుల వర్ణనాప్రచురములును గాఁగలిగినవి.

గాయకునకు కంఠము వనిముట్టు కవికి శిల్పికి కలము వనిముట్టు, పాటకుఁడస్థిరుఁడు. వాని ధార యచిరము, కవి శిల్పులు సుస్థిరులు. వారి ధార సుచిరము, సురుచిరము, వీరి లిపియు లేఖినియు వీరిని శాశ్వతులఁ జేయుచున్నవి. గాయకుని కృషివినికి యగుటచే అనుకరణముల అనుసరణము గలది. కవిశిల్పులది కేవలమూహానుభవప్రపంచము. "ఉద్ధరే దాత్మనాత్మాన" మనునట్లు పాటకుఁడు తానుండియే రజింపఁ జేయవలెను. కవి శిల్పులకా బాధలేదు. పాటకుఁడు తానుగనే మెప్పింపవలెను. కొంతవఱకు చిత్రస్రష్టయు నట్లే. కవులు తమంతతాముకంటె నన్యుల నపేక్షింతురు.

పాడుమని బలవంతపెట్టినను పాడక తన పిచ్చికొఱకెప్పుడో పాడుకొనునది సంగీతము. అన్యులకొఱకు కాదు తనపిచ్చికొఱకే. ఇప్పటి కవులు కొందరు తమ పిచ్చికొఱకే యందురు కాని అన్యులు మెచ్చకున్నను, ఆదరింపకున్నను వారును చిన్నబుచ్చుకొనువారే. ఈతఁడు కోరునది పాటకుని వలె, ఆత్మానందమే కాక, సర్వజనామోదము, సర్వకాలామోదము. కాని "ఊరకకృతుల్ రచియింపశక్యమే" యను

టయు నిజమే. 'నిరుపమాతిస్థలము రమణీప్రియమూర్తిక విడె
ములు' తదభివృద్ధికి తోడుపడునవే.

అవిస్మరణీయాంశము మఱొకటి. గాయక-చిత్రకారుల
కలభ్యయోగమగునది కవికి నైజము నగునది క్రాంతదర్శి
త్వము. "నానృషిః కవిః" యను దానికిదియే తాత్పర్యము.
గాయకుని తత్త్వము శుశ్రూష, శిల్పిది దిదృక్షు, కవిది వివక్షు,
కవిశిల్పు లిరువురగుణము కళాసిసృక్షు. అందు కవిసృష్టి,

"రమ్యాణి వీక్ష్య మధురాన్ శ్చ నిశమ్య శబ్దాన్
భావాంతరాణి జననాంతరసౌహృదాని".

ఇట్టి సున్నితములు లలితములునగు కళల సంయోగ
మొకచో సిద్ధించిననాఁడు,

"వస్త్వేకైక మహీరుహా వాంఛిత ఫలప్రాప్తేః పదంకింపునః
మద్భాగ్యోపచయాదయం సముదితః సర్వోగుణానాం గణః."

"నాటకాంతే సాహిత్య"మను వారిభావము తూచినట్లు
చెప్పుట కిప్పటికి సందొదొఱకినది. అవకాశమేర్పడినది. ఆనం
దమను నాటకమున, గాయకుఁ డుపనాయకుఁడు. వీనిచుఱు
కుదనము నాందిప్రస్తావనల లోనే విదితమగును. చిత్రకారుఁడు
అంకాస్యాంకావతరణముల యందు (విష్కంభములయందు
స్వగతములను ఆకాశభాషితములను క్వాచిత్కముగ) ప్రధాన
పాత్రయే. కవి కథానాయకుఁడు. బీజబిందువతాక ప్రకరీకార్య
ములయందు గర్భవిమర్శనిర్వహణములయందు నుద్దీపితుఁడుగ

చరించి భరతవాక్యమును చెప్పించువాఁడు. ఆనందమే ప్రకృతి, తత్ప్రాణిగ్రహణోద్యమమే నాటకకథావస్తు వనుకొనుఁడు. ఇందలి ధ్వని యానందవర్ధనము. ఇందలి యలంకారవృత్తులు వామనులే కాదు ధీమణులందరు కొనియాడునవి. ఇందలి యౌచిత్యవిచారచర్చ క్షేమేంద్రునిదే కాదు రసికులు సుధీంద్రులునగు వారి దందరిది. ఇదియే జగన్నాటకము.

ఇటువంటి కవులు ప్రజలకందరికి సంసుబోటు కారు కదా, వారి మాటలుగూడ అందరికి తెలుగు కెక్కనవలెనన్న దుర్ఘటమే. అటుకాక బైరాగులు తంబురాపట్టి పాడు వేదాంతోపదేశములు పామరులకును ప్రయోజనకారులగుచున్నవి. అట్లే త్యాగయ్యగారి, ఎవరని నిర్ణయించేదిరా, శివుఁడనో మాధవుఁడనో అనుట సుగమముకదా. కావ్యేషు నాటకం రమ్యమనుట యేల? శ్రవ్యప్రబంధముకన్న దృశ్యప్రబంధము రాగతాళాభినయములచే ప్రజాబాహుళ్యమునకు తెలియఁ జెప్పుటలో సులభతరమగుటనే. తుణోకస్మును పరమానందమును పండితపామరుల కిరీతి పంచిపెట్టునది సంగీతము. ఆలోచన చేసి ఆలసించినఁగాని ఆనందమునుఁ గలుగఁజేయునది సాహిత్యము. వినినది చిరతరముకదా. కనుకనే నెలతక్కువ పిల్లల వలె కాఁబోక, సరస్వతీ స్తనద్వయమగు సంగీతసాహిత్యములను స్తన్యములగ్రోలి సరియగు పుష్టిగలిగి మానవుఁడు వర్ధిల్లునుఁ గాక.

"మాణిక్యవీణాముపలాలయంతీం మదాలసాం మంజుల
వాగ్విలాసాం" అని మనసా స్మరించి

సామాంపాతు సరస్వతీ భగవతీ నిశ్శేష జాడ్యాపహా
యని వాంఛించుటలో పరమార్థ మిదియే.

అప్పుడు 'భారతీదేవి ముంజేతి పలుకుచిలుక' వరికని
కవిసార్వభౌముం డుద్దేశించెనో! వారెట్టి మహానుభావులో!

అటుగాక సంస్కృత మేకొంతయో చదివినగాని సుమతి
శతకము కుమారీశతకము నైన చదువక తెలుగు పండితులగు
వారివలె, సింగ్లీషుబడులలో పట్టభద్రులై గీర్వాణాంధ్రములను
నలిపివైచి అల్లరికవిత్వము చెప్పు నధికులవలె నగచాట్లు పెట్టక,
తాముపడక, వక్షస్తనదుగ్ధపానప్రాప్తిని అసంపూర్ణావయవ
వృద్ధిగలవారగుటయు తమతమపూర్వజన్మకృత పాపఫలమే యని
యాత్మవితర్కము గలవారై, సంగీతము రాని సాహిత్యకారులు
గాక, సాహిత్య శూన్యులగు సంగీత విద్వాంసులుగాక యుభ
యామృతపానపుష్టి నభిలషించి శ్రేయోభివృద్ధులందుదురుగాక.
ఇదే అక్షరాభ్యాసమునాడు మనచే చదివించి పఠింపజేసినది.

సరస్వతి నమస్తుభ్యం, వరదే కామరూపిణి,
విద్యారంభం కరిష్యామి, సిద్ధిర్భవతు మే సదా.



రాజమండ్రి శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయడుగారి సరస్వతీ పవర్
ప్రెస్ నందు, 65 వ పేజీ మొ॥ 102 వరకు ముద్రించడమైనది 9238—35.